## గంటాల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ త్రయో॥ 1949 సం॥ ఏప్రిల్ 26 మంగళవారం మం॥ త్రయోదశి ప 9 4 రేవ 24 0 ; వర్జ్యం సా 6_55 ల 8_44 కు.

బ॥ చతుర్దశి ఏప్రిల్ 27 బుధవారం బు॥ చతుర్దశి ప 11 28 రేవ ప 8_24 వర్జ్యం లేదు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర బ॥ త్రయో॥

మంగళవారం

## కామన్వెల్తు దేశములలోని భారతీయులు

మాతృదేశము స్వతంత్రమైన ఖండాంతరములందలి భారతీయుల స్థితిగతులు చక్కబడగలవను ఆశ, దేశ స్వాతంత్ర్యము లభించిన రెండు సంవత్సరముల అనంతరము కూడ సఫలము కావలసిన ఆశగనే ఉండిపోయెను. యూరపియనుల, శ్వేతజాతుల యాధిపత్యమును నెలకొల్పి, సుస్థిరము చేయుటకు ప్రయత్నించు దక్షిణ ఆఫ్రికా యూనియన్ ప్రభుత్వము తన వర్ణవివక్షత విధానమును అనుసరించి అచటి భారతీయులపై అతికఠినశాసనముల అమలు చేయుట కొంతవరకు సహజమె కావచ్చును. కాని నాటి ఆసియా రాజ్యములై కొన్ని శతాబ్దములుగ సాంస్కృతిక సంబంధములను కలిగిన బర్మా, సింహళ దేశములు; అనేక దశాబ్దములుగ ఆ దేశమునందుండి, స్థిరనివాసముల నేర్పరచుకొనిన భారతీయులపై ఇంచుమించుగ దక్షిణాఫ్రికా ప్రభుత్వము అమలు జరిపిన శాసనముల వంటి శాసనముల నమలుజరుప నుద్యమించుట కొంత విపరీతముగ కన్పింపక మానదు.

బర్మా, సింహళ దేశములందు భారతీయుల స్థితిగతులు ఇంచుమించు ఒకేవిధముగ నున్నవి. ఆ రెండు దేశములును స్వాతంత్ర్యమును పొందిన వెంటనే తమ దేశమునందున్న భారతీయుల పౌరహక్కుల పరిమితము చేయుచు, పౌరసత్వమును పొందుటకు సాధారణముగ అనిగమింప సాధ్యముగాని నిబంధనల నేర్పరచినవి. బర్మా ప్రభుత్వము, భారతీయ భూస్వాముల పరముగనున్న భూములను నామమాత్రము పరిహారము చెల్లించి స్వాధీనము చేసుకొన తీర్మానించుకొనెను. అదే విధముగ భారతీయుల రాకపోకలపై క్రొత్త నిబంధనలను అమలు జరిపెను. భారత-బర్మా ప్రభుత్వముల మధ్య ఈ విషయమై సంప్రతింపులు జరిగినను, బర్మాయందు ఏర్పడిన అసాధారణ పరిస్థితులు కారణముగ ఈ సమస్యలు తృప్తికరముగ పరిష్కారము కాకుండెను.

ఇంచుమించుగా ఇదే విషయములపై భారతప్రభుత్వము సింహళ ప్రభుత్వముతో రాయబారములు జరిపియుండెను. సింహళ ప్రధాన మంత్రి సేనానాయకే ఇదే సమస్యపై భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూతో గత సంవత్సరము స్వయముగ సంప్రతింపులు జరిపెను. సింహళమును తమ మాతృభూమిగ చేసుకొనగోరు భారతీయులకు సింహళపౌరసత్వము లభింపగలదని సింహళప్రభుత్వము హామీని ఇచ్చియుండెను. కాని సింహళ భారతీయులు అందరు ప్రతిఘటించిన పౌరసత్వహక్కులకు సంబంధించిన రెండు శాసనములను అమలు జరుపుటకే సింహళ ప్రభుత్వము నిశ్చయించుకొనెను. ఈ పరిస్థితులలో గతవారము జరిగిన సింహళ భారతీయకాంగ్రెసు మహాసభయందు ఆచార్య కృపలానీ ప్రభృతులు స్పష్టము చేసినట్లు, భారతప్రభుత్వముగాని భారతీయులుగాని చేయకల్గినది అత్యల్పము. సింహళమునందలి భారతీయులు తాము సింహళ దేశస్థులమేనని భావించుకొనవలెనని, వారు తమ న్యాయమైన హక్కులను సాధించుకొనుటకు స్వశక్తిపైననే ఆధారపడవలెనని భారతీయనాయకులు చేసినఉద్బోధలను, సింహళ భారతీయ నాయకులు గ్రహించి తదనుగుణముగ వ్యవహరింప తీర్మానించుట సంతసింపతగ్గ విషయము.

సింహళమునందలి భారతీయ కార్మికుల స్థితి మరింత అధ్వాన్నముగ నున్నది. సింహళ ప్రభుత్వ క్రొత్త విధానము ననుసరించి అనేకమంది నిరుద్యోగులైరి. వారికి వేరు జీవనోపాధిని కల్గింపకనె, వారిని పనినుండి తొలగించి, వారి స్థానే సింహళ కార్మికుల నియమించుట జరిగెను. ఆ సందర్భమున జరిగిన సత్యాగ్రహము సద్యః ఫలితములను మాత్రమె సమకూర్చకలిగెను. తిరిగి ఇపుడు పరిస్థితులు మామూలుగనె యున్నవి.

ఖండాంతరములందలి భారతీయు లందరు ఇంచుమించుగ ఒకే విధమైన సమస్యలను ఎదుర్కొనవలసినవారైరి. డాక్టరు మలాను ప్రభుత్వము దక్షిణాఫ్రికానుండి, సేనానాయకె ప్రభుత్వము సింహళమునుండి భారతీయులను వారి దేశమునకు పంపివేయుటకు కృతనిశ్చయులై యుండిరనుట నిస్సందేహము. అందుకు వారనుసరించు విధానములు భిన్నములైనను, ఫలితములు, భారతీయులకు సంబంధించినంత వరకు ఒకటిగనె యుండును.

భారతదేశము స్వాతంత్ర్యమును పొందుటతో ఈ సమస్యలు సంతృప్తికరముగ పరిష్కారమగుటకు బదులు, మరింత క్లిష్టమైనవి. ఖండాంతరములందలి భారతీయుల బాధ్యతలు, విధులు నేడధిక మైనవి. వారు తమ ప్రస్తుత నివాస దేశమునె తమ మాతృభూమిగ చేసుకొని కాలక్షేపము చేయదలచినను, అట్టిది సాధ్యమగునట్లు కన్పించదు. బర్మా కామన్వెల్తు నందు లేనందున అచటి భారతీయులసమస్యను విడిగ విచారించినను, సింహళము దక్షిణ ఆఫ్రికా, తూర్పు ఆఫ్రికా మున్నగు దేశములందలి భారతీయుల సమస్యను కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశము పరిశీలించి ఒక శాశ్వత పరిష్కారమును సాధించుట అత్యవసరము. కామన్వెల్తు రాజ్యముల సఖ్యతను ఇట్టి పరిష్కారము దోహదము చేయగలదు.

### ప్రత్తి కంట్రోలునుయిందున సవరణ

హైదరాబాద్, ఏప్రిల్ 24 : ప్రతి మణుగుకు పైగా ప్రత్తిని కొనా నో లు చేయుటకు, అమ్ముటకు, నిల్వ చేయుటకు, చేరు ... [illegible] ... వచ్చినదని హైదరాబాద్ ప్రభుత్వం ప్రత్తి కంట్రోలు నిబంధనలో సవరణ చేసినది.

## పారిశ్రామికులతో పోటీ చేయు ఉద్దేశము ప్రభుత్వమువారికి లేదు

### డా. ముఖర్జీ హామీ

పూనా, ఏప్రిల్ 24 : భారత పారిశ్రామికులతో పోటీకి తలపడి, ఈ పారిశ్రామికులు జయప్రదముగా సాగించు చున్న పరిశ్రమల నుండి వారిని వదలగొట్టు ఉద్దేశ్యము లేదని నేడు ఇండియా ప్రభుత్వ పరిశ్రమల, సప్లయిశాఖ సభ్యుడు డా॥ శ్యామ ప్రసాద్ ముఖర్జీ గారు పారిశ్రామికులకు హామీ యొసంగిరి.

భారతదేశ భవిష్యత్ పారిశ్రామిక విస్తరణలో తమకు న్యాయమైన పాలు లభించకుండా చేయుచున్నారని భారత పారిశ్రామికులు భయపడవలసిన అవసరము లేదని డా॥ ముఖర్జీ గారు మహారాష్ట్ర వాణిజ్య సంఘసభలో ప్రసంగించుచు చెప్పిరి. ఈ సంఘమునకు క్రొత్త భవనములనుకూడ ఆయన ప్రారంభించెను.

ప్రభుత్వమువారు ప్రకటించిన పారిశ్రామిక విధానము అత్యంత సంతృప్తికరముగా నుండెనని, ఈ విధానము కొన్ని విషయములలో బాధ్యతను ప్రభుత్వముపై మోపుచు భారతదేశ ఆర్థిక పునర్విర్మాణమునందు ప్రయివేటు పారిశ్రామికులు సముచితమైన పాత్ర వహించుటకు అవకాశమొసంగుచున్నదని ఆయన చెప్పెను.

### చాలా పరిశ్రమలు వ్యక్తులకు వదలివేయబడును

భారతదేశాభివృద్ధి ఒక పథకము ననుసరించి జరుగవలసిన యెడల ఈ పథకములు వేయుటకును, వానిని సరిగా అమలు చేయుటకును ప్రభుత్వమువారికి విస్తృతమైన అధికారము లుండవలెననిరి. ప్రభుత్వమువారు విస్తృతమైన అధికారములు స్వీకరించిన యెడల అందరికి విశ్వాసము కలుగునట్లు వారు వానిని చలాయించవలెనని, ఇందుకై నియమింపబడు అధికారులు లంచములు తీసికొననివారుగను ఇతర అకార్యములు చేయనివారుగను ఉండవలెనని, డా॥ ముఖర్జీ గారనిరి.

భవిష్యత్ భారత పారిశ్రామికాభివృద్ధిలో తమకు న్యాయమైన భాగము లేకుండా చేయుచున్నారని పారిశ్రామికులు భీతినొంద నవసరములేదనిరి. కొన్ని పరిశ్రమలు ప్రభుత్వమువారి కంట్రోలులోను, నిర్వహణలోను వుండునని, ప్రభుత్వమువారు కొన్ని పెద్ద ప్రాజక్టుల నిర్మాణమునకు పూనుకొన వచ్చునని, చాలా పరిశ్రమలు ప్రయివేటు వ్యక్తులక్రింద నుండునని డా॥ ముఖర్జీ గారనిరి.

### ప్రభుత్వమువారి దిగుమతుల విధానము

ప్రభుత్వమువారు దిగుమతుల విషయమై అవలంబించుచున్న విధానము మన్నిరకముల పరిశ్రమలకు నష్టము కలిగించుటచే ప్రభుత్వమువారు దానిని పునర్విచారించవలెనని సంఘమువారు కోరిన కోర్కె విషయమై డా॥ ముఖర్జీ గారు ప్రస్తావించుచు నిరంతరముగా కోరు పరిశ్రమలు వర్ధిల్లజాలవనిరి. భారత పరిశ్రమలు వర్ధిల్లవలెనని ప్రభుత్వమువారు వాంఛించుచున్నారు. పరిశ్రమలకు నష్టము కలిగించు పనులేమియు ప్రస్తుత భారత ప్రభుత్వము చేయదని డా॥ ముఖర్జీ గారనిరి. భారతదేశము వారికి గల యావశ్యక వస్తువులను విదేశములనుండి తెప్పించుకొనవలెననియు, ఇట్లు తెప్పించుకొనుటలో ఇదివరకు దేశములో నున్న పరిశ్రమలు నష్టపడకుండా చూడవలెననిరి. ప్రభుత్వ విధానము తమకు నష్టము కలిగించుచున్నదని ఏ పరిశ్రమవారైనను తలచినయెడల, తమకు ప్రత్యేక రక్షణ కావలెనని ఏ పరిశ్రమ వారైనను వాంఛించిన యెడల అంగుళమైన విచారణ చేయవలెనని ఆ పరిశ్రమను నిర్వహించువారు ప్రభుత్వమువారిని కోర వచ్చునని ప్రభుత్వమువారు స్త్రమముగా యిట్టి విచారణ చేసి నిర్ణయములు గావించెదరని మంత్రి చెప్పెను.

ప్రస్తుత సమయమున భారతదేశములో తయారగుచున్న వస్తువుల ఉత్పత్తి ఖర్చులు విదేశములనుండి దిగుమతి యగుచున్న వస్తువుల ఉత్పత్తి ఖర్చులకంటె హెచ్చుగా నున్నవని, ఈ ఖర్చులను తగ్గించుటకు ... [illegible] ... పారిశ్రామికులు ... [illegible] ... ప్రభుత్వమువారు, పారిశ్రామికులు ... [illegible] ... పరిశ్రమలు ... [illegible] ... డా॥ ముఖర్జీ గారనిరి.

భారతదేశములో ఉత్పత్తియగు వస్తువులు ... [illegible] ... డా॥ ముఖర్జీ గారు ... [illegible] ... పారిశ్రామికులు భారత ప్రభుత్వ ... [illegible] ... ప్రభుత్వమువారు ... [illegible] ... రసుగా వింపవలెననిరి. ప్రమాణములను అమలు చేయుటకు యిప్పుడు శాసనమేమియు లేదని, శాసనముచేయుట యికముందు అవసరము కావచ్చునని ఆయన చెప్పెను. బలవంతముగల్ల ఈపని జరుగునదికాదని తాను గ్రహించుచుండెనని ఆయన చెప్పుచు పారిశ్రామికుల సహకారముతో ఈ పని జరగవలెననిరి. ఈ ప్రమాణములు భారత పరిస్థితులకు అనుగుణమైనవిగా నుండవలెనని యిట్టివేయుట విదేశీయవస్తువుల ప్రమాణములకు చాలా దూరముగా నుండరాదనిరి.

### పారిశ్రామిక లెక్కలు

పారిశ్రామికులు సప్లయి చేయు లెక్కలపై ప్రభుత్వమువారు సర్వేకొరకు ఆధారపడవలసియుండుటచే పారిశ్రామికులు లెక్కలు తెలుపు ఒక సంస్థను ఏర్పరచుకొనవలెనని డా॥ ముఖర్జీ గారనిరి. ఇప్పుడు పారిశ్రామికులనుండి లెక్కలు తెప్పించుకొనుట బహుకష్టముగా నున్నదని ఇందువల్ల ప్రభుత్వమువారు 1949వ సం॥ వరకు లెక్కలు ప్రచురించలేకపోయెనని చెప్పిరి. మహారాష్ట్రలో పరిశ్రమలను నిర్వహించుట లో మహారాష్ట్రీయులు ప్రత్యేకమైన పాత్ర వహించెనని డా॥ ముఖర్జీ గారు చెప్పుచు ప్రాంతీయ దృక్పథముతో పారిశ్రామికులు దేశీయ ప్రయోజనము విస్మరించరాదనిరి. సంపూర్ణముగా సహాయము చేయుమనిరి.

సంఘాధ్యక్షుడు శ్రీ కే. ఎన్. పాటిల్ గారు మహారాష్ట్ర పారిశ్రామికుల కష్టసుఖములను మంత్రికి తెలియజేసిరి.

గవర్నర్ జనరల్ సందేశము, బొంబాయి గవర్నరు మున్నగు వారినుండి పలువురు సందేశములు వచ్చెను.

## "దేశం స్వయం పోషకం కావడం తప్పనిసరి"

### ఎ. ఎన్. ఖోసలా ఉద్ఘాటన

బెంగుళూరు, ఏప్రిల్ 24. నేడు మైసూరు ఇంజనీర్ల సమాజంవారి 37వ వార్షిక సమావేశాన్ని ప్రారంభించుతూ ఇండియా ప్రభుత్వ సలహాదారు ఇంజనీరైన ఎ. ఎన్. ఖోసలా ఈ విధంగా చెప్పారు:

"ఇండియా సహజసంపదను వినియోగపరచడంలో రాష్ట్రాల మధ్య తగాదాలేర్పడి సమగ్ర ఫలితాలు లభించకుండా పోవడాన్ని నిరోధించి, నీరు మొదలైనవి దేశం యొక్క ప్రయోజనానికను కూలంగా వినియోగపడేటందుకు తగు చర్యలు తీసుకొనడానికి ఇండియా ప్రభుత్వం ఆలోచించుచున్నది. ఇందు విషయమై క్రొత్తచట్టాలుకూడా జరగవచ్చు. బ్రిటిషు వారి పరిపాలనలో, మైసూరులోవలెకాక, దేశంలోని ఇంజనీర్లకు అవకాశాలు నిరాకరించబడ్డవి. నూతన నిర్మాణం సాగించడానికిప్పుడు ఇంజనీర్లకు అంతులేని అవకాశాలున్నవి. ఈ అవకాశాలను ప్రజా సామాన్యం ప్రయోజనాల కనుకూలంగా వినియోగించాలి. ఇండియా ఎల్లప్పుడు ఇతరులపై ఆధారపడి ఉండడం కీర్తి ప్రదంకాదు. కనీసం ఇతరులనుంచి పుచ్చుకొన్నంత అయినా ఇతరులకిచ్చే స్థితిలో దేశం ఉండాలి. ముందుకువచ్చిన దేశాలు స్వవిషయాలే ముఖ్యంగా ఎంచి, తమకు లాభం ఉంటేనే వెనకపడి ఉన్నవారికి సహాయం చేయడం స్వాభావికం కనుక మన అభివృద్ధి మనమే చేసుకోవాలి.

"జూలై 30న పారిస్ లో అంతర్జాతీయ ఇంజనీరింగు సంస్థల కౌన్సిలు ఏర్పరచడానికి సమావేశం జరగనున్నది. ఆ సమావేశంలో నేను కొన్ని సంస్థల కార్య కేంద్రాలైనా ఇండియాలో ఉంచాలని సూచన చేస్తాను.

"ఇండియాకు అపారమైన జలసమృద్ధీ భూసమృద్ధీ, అంగబలమూ ఉన్నవి. మనము ఇతరులపై ఆధారపడడం తగ్గించాలి. 1951 లోగా ఆహారసమృద్ధి సాధించాలంటే ఆహారోత్పత్తి పథకాలకు ప్రభుత్వం అగ్రస్థానం ఇవ్వాలి. ఇండియా ఏయే వస్తువుల కొరకు పై దేశాలమీద ఆధార పడుతున్నదో వాటి విషయంలో స్వయం పోషకత్వం 7 మొదలు 10 సంవత్సరాల కాలంలో సాధించడానికి ఆలోచనలు జరుగుతున్నవి."

సమావేశం ఆరంభం కావడానికి ముందుగా మాట్లాడుతూ మైసూరు మంత్రి కే. భాష్యం, ప్రజలు ఇంజనీర్లపై ఆశలు పెట్టుకొని ఆత్రంగా ఎదురుచూస్తున్నారనీ, ఇంజనీర్లుకూడా 19వ శతాబ్దపు పద్ధతులతో 20వ శతాబ్దపు అవసరాలు సాధించలేరనీ, మైసూరు ఇంజనీర్లు ఇతర దేశపు ఇంజనీర్లకు ఏ మాత్రమూ తీసిపోని ఘనకార్యాలు సాధించాలనీ, మైసూరుకు ఆమెరికాను మించిన విద్యుచ్ఛక్తి వనరులు శక్యం ఉన్నాయనీ, ఇంజనీర్లు మాత్రమే పూనుకోవాలనీ, ఇంజనీరింగులో కూడా సౌందర్యదృష్టి విడనాడరాదనీ అన్నారు.

## ఆంధ్రతోబాటు కర్నాటక రాష్ట్రం కావాలి

### కర్నాటక కాంగ్రెసు కమిటీ అధ్యక్షుని ప్రకటన

బెంగుళూరు, ఏప్రిలు 25: కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు ప్రెసిడెంటు యస్. నిజలింగప్పగారు తమ అభిప్రాయము నిట్లు ప్రకటించిరి.

కర్నాటకరాష్ట్రము ఏర్పాటు అయ్యేవరకు బళ్లారిజిల్లాలో చేరిన కర్నాటక ప్రాంతమును 6 తాలూకాలున్నూ ఆంధ్ర రాష్ట్రములోనె చేరియుండవలెనని ఇటీవల రాష్ట్రపతి డా॥ పట్టాభిసీతారామయ్యగారు తమ అభిప్రాయమును వెల్లడించిరి. కాని, యీ పద్ధతి కన్నడులకు అంగీకారయోగ్యమైనది కాదు. బళ్లారి జిల్లాలో 9 తాలూకాలు కలవు. వానిలో 6 తాలూకాలు పూర్తిగా కన్నడులు నివసించు తాలూకాలై యున్నవి. మిగిలిన 3 తాలూకాలయందు అనగా ఆలూరు, ఆదోని, రాయదుర్గ తాలూకాల యందు ఆంధ్రులసంఖ్య అధికంగా ఉంది. కన్నడులు మద్రాసు రాష్ట్రములోని కొన్ని ప్రాంతములందును బొంబాయి రాజధానిలోని కొన్ని ప్రాంతములందును అల్ప సంఖ్యాకులుగా నివసించుచున్నారు. వారు పలుకుబడిలేని అనాథులుగా యీ రెండు రాష్ట్రములందు పడియుండుట దుస్సహము. కనుక, ఆంధ్రుల తోబాటు కర్నాటక రాష్ట్రమునుకూడా ఏర్పాటు చేయుట ఉత్తమమైన పద్ధతి.

బళ్లారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలయందు ఆంధ్రుల పలుకుబడి ప్రాబల్యము హెచ్చుగా నున్నదనే కారణంచేత వాటిని ప్రత్యేకించవలసిన అగత్యం కలిగినది కాని లేనియెడల ఆనూడు తాలూకాలు కర్నాటక రాష్ట్రములోనే చేర్చబడవలెను. అని కేల్కారుగారి పంచాయితీ తీర్పునందు ఒకవ్వడు వ్రాసియుండిరి. కేల్కారుగారి నిర్ణయము జరిగిన 10 సం॥ పిమ్మట తిరిగి యీ 3 తాలూకాలను ఏ రాష్ట్రంలో చేర్చవలెననే విషయమై పునర్నిర్ణయం చేయవలెనని కేల్కారు నిర్ణయ నివేదికలో వ్రాయబడెను. ఈ మూడు తాలూకాలు కర్నాటకమునందు చేర్చకపోవుట అక్రమమనెడి అభిప్రాయము ప్రబలమగుచున్నది. కాని చిల్లర వివరములనుగూర్చి యిప్పుడు నేను పోరాడ దలచుకోలేదు. ఆ చిల్లర వివాదములను మనలో మనము పరిష్కరించుకోగలము. అనవసరమైన సంఘర్షణలు కలుగకుండా చూచుకోవలెను. అనంతపూరు జిల్లాలో కన్నడ ప్రాంతం కలదు. కర్నూలు జిల్లాలో కొంత కన్నడప్రాంతం కలదు. వీటి విషయమై పరస్పరము సంప్రతించుకొని చర్చించుకొని సౌమ్యంగా పరిష్కరించుకోవచ్చును.

## తోటి దేశాలకు సాయపడడమే

### ట్రూమన్ విధానంపై అమెరికా వాణిజ్యకార్యదర్శి వివరణ

కేప్‌హార్టీ, (వర్జీనియా) ఏప్రిల్ 24 : "ట్రూమన్‌విధానం, కేవలం వెనకబడివున్న తోటిదేశాలకు సాయపడే అభిలాషతో మాత్రమే అమలుజరుపబడుతోంది. ఆయా బీద ప్రాంతాల ప్రజలకు శాంతిసంపదలు లభించడమే మా సదాశయం" అంటూ అమెరికా, వాణిజ్యశాఖా కార్యదర్శి చార్లెస్ సాయర్ కేప్‌హెన్రీలో జరిగిన ఒక బహిరంగ సభలో ప్రసంగించారు. ఇంగ్లీషువారు మొట్టమొదట ఈ తావున 1607 లో ప్రవాస నివాసం యేర్పరచుకున్నారు. తత్స్మారకార్థం ఈ బహిరంగసభ యేర్పాటుచేయబడ్డది.

"మేము సాధించుకున్న శాస్త్రవిజ్ఞానాన్ని, సాంకేతిక పారిశ్రామిక విజ్ఞానాన్ని ఆర్థికశక్తిని ఇతరులకు కూడా లభింపచేసి వారి అభివృద్ధికి తోడ్పడాలని మాస్తున్నాం. ఆకలి, దారిద్ర్యమూ ఈ భయాలనుంచి ప్రజల్ని కాపాడాలని మాస్తున్నాం.

"అంతర్జాతీయ పరపతిసంఘం, ఐక్యరాజ్య సమితీ, ఈ కార్యక్రమాన్ని కొంత సాధించగలిగినా, శ్రేష్ఠ వ్యాపారాల నుంచి కూడా దీనికన్న పెట్టుబడి సహాయం లభింపవలసివుంటుంది.

"సామ్రాజ్యము స్థాపించాలని యే దేశాన్నీ అమెరికా ఈ సహాయాన్ని కోరడంలేదు. ఇంకాకా ప్రత్యేకన్నియంగా అమెరికా వ్యాపారానికి ప్రాంతీయాధికారాలేవీ కావాలనీ కోరటంలేదు. మా దేశంలో ఇతరులకు ఏమే సదుపాయాలు కలుగజేస్తున్నామో, అవే ఇతరుల నుంచి కోరుతున్నాం." అన్నారు.

## నెహ్రూ ప్రణాళిక

[1 వ పేజీ తరువాయి]

నిస్తున్నారు.

సమావేశానికి అతిసన్నిహితంగా ఉన్న వర్గాలవారు కొంతవరకు ఆశాభావంతోనే ఉన్నారు. వాతావరణం అనుకూలంగా ఉన్నది. కామన్వెల్తు సమావేశంరాజుతో సంబంధంవిషయంపై ఏదోఒక సమాధానానికి రావలసియుంటుంది.

"సండే టైమ్స్" రాజకీయ విలేఖరి ఇలా వ్యాఖ్యానించాడు :- "విభిన్నజాతులకు చెందిన వారుకలసియున్న సమాఖ్యగానే కామన్వెల్తు ఉండాలంటే, బ్రిటిషువారికీ, తత్సంబంధీకులకూ ఉన్న చరిత్రాత్మక, అనురాగ సంబంధాలదృష్ట్యా సానుభూతి చేసేవారనికూడా కలుపుకొని ఉండడానికై కామన్వెల్తు స్వరూపాన్ని మార్చవలసియుంటుందని ప్రాతినిధ్యంగల వ్యక్తులు గుర్తించినాయి."

పండిత నెహ్రూ పంచసూత్ర ప్రణాళికనొక దానిని కామన్వెల్తు ప్రధానులకు సూచించారని "ఆబ్జర్వర్" పత్రిక ప్రకటించింది. అసూత్రాలివి. (1) రిపబ్లిక్ దేశాలు కూడా కామన్వెల్తు సభ్యదేశాలుగా ఉండాలి. (2) బ్రిటిష్ రాజును కామన్వెల్తు "మొదటి పౌరుడు"గా రిపబ్లిక్కులు గుర్తిస్తాయి. (3) విదేశాంగ వ్యవహారాలలో భారతం రాజు అధికారాన్ని గౌరవిస్తుంది. కాని రాజుకు అంతరంగిక వ్యవహారాలలో అధికార మేమీఉండదు. (4) కామన్వెల్తుకు ముందు "బ్రిటిష్" అనే పదం ఉపయోగింప బడరాదు. (5) "డొమినియన్" అనే పదంకూడా ఉపయోగింపబడకూడదు.

పండిత నెహ్రూ ప్రతిపాదనలలో చాలా వాటిని ప్రధానులు అంగీకరిస్తారని ఈ పత్రిక వ్రాసింది. రాజును "మొదటి పౌరుడు"గా పిలవటానికి ఆస్ట్రేలియా, న్యూజిలాండు, సిలోను, పాకిస్తానులు అంగీకరించడం లేదు.

డాక్టర్ మలాన్ పండిత నెహ్రూ ప్రణాళికను బలపరుస్తున్నాడనీ; పెట్రిక్ గోర్డన్ వాకర్ గారింకా ఒక నిర్ణయానికి రాలేదనీ ఈ పత్రిక వ్రాసింది. గ్లోబ్.

## మిలిటరీ గవర్నర్ నిర్ణయం

[1 వ పేజీ తరువాయి]

మరికొన్ని సమయాలలో మందంగాను, ఉన్నదని, అయినా ముందు వర్షాకాలంలో, కమ్యూనిస్టుచర్యలు చాలా ఉధృతం కాగలవని భయపడుతున్నామని చౌదరి అన్నారు.

"ఏమైనా పరిస్థితి యావత్తూ మాగా అదుపులోనే ఉన్నది. "కిస్తు వసూళ్లు, ధాన్య సేకరణ, వచ్చేరాజ్యాంగ పరిషత్ ఎన్నికలకు గాను ఇండ్లకు నంబర్లు వేయుట యీ మొదలగు పనులన్నీ కమ్యూనిస్టుసంక్షోభిత జిల్లాలలో సంతృప్తి కరంగా సాగుతున్నవి. యు. పి. నుంచి సాయుధ పోలీసు పటాలములు త్వరలో సంస్థానమునకు రానున్నవి." ఈ నిర్బంధములో నున్న లాయిక్ ఆలీ ప్రభుత్వ సభ్యుల విషయమై మాట్లాడుతూ, వీరిని విచారణ చేయవలసిన పని ఆలస్య మవుతున్న సంగతి తమకు తెలుసునని అయినా యింకా ఆలస్యం జరుగదని, త్వరలోనే వీరి విచారణ ప్రారంభమగునని చెప్పాడు.

"ఖాసిం పై నేరాలు దర్యాప్తు చేస్తున్న ప్రత్యేకోద్యోగి దర్యాప్తు పూర్తిచేశాడు. అదేవిధంగా రజాకర్ నాయకుడు కాశింరజ్వీపై కూడా చార్జిషీట్లు పూర్తిచేయబడినవి. త్వరలోనే రజ్వీవిచారణ కూడా ప్రారంభమవుతుంది. పోలీసుచర్య పూర్వం లాయిక్ అలీ ప్రభుత్వం కొన్ని రాజకీయపక్షాలకు చెందిన వ్యక్తులపై జారీ చేసిన వారంట్లను రద్దుచేసే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

హైదరాబాద్‌కు యూనియన్ ఆఫీసర్లు విశేషంగా వస్తున్నారని కొందరు భయపడుతున్నారు. కాని అలాంటిదేమీ లేదు. ముఖ్యంగాని బయటివారికి ఉద్యోగాలివ్వబడుటలేదు సాంకేతికవిద్యాపరిజ్ఞానము ఉన్నవారిని బయటినుంచి రప్పించుట జరుగుచున్నది. ఏమైనా మామూలు పరిస్థితులు ఏర్పడగానే, ముఖ్యంగా కానివారంతా తమ తమ రాష్ట్రాలకు తిరిగిపోగలరు. హైదరాబాద్ భారత యూనియన్లో చేరేంత కాలమూ సంస్థానము ప్రత్యేకముగా యూనియన్‌తో సంఘటిత పర్చబడ అసంభవము. ఇలాంటి ప్రధాన విషయాలన్నీ, ప్రజా ప్రభుత్వ నిర్ణయానికే వదలివేయబడినవి" అని చౌదరి తెలియజేశారు.

ఇంగ్లాండులో తన కుమారు లుండుట చేత నిజాం యింగ్లాండ్ వెళ్ళబోతున్నదని, ఒకరి ప్రశ్నకు సమాధానం చెప్పారు. పరిస్థితులను స్వయంగా చూచే నిమిత్తం త్వరలో తాను సంస్థాన మంతటా పర్యటన ప్రారంభిస్తానని కూడా చౌదరి వెల్లడించారు.

## చెన్నపురి విసర్జింపు

### మదరాసు తమిళజిల్లా కాంగ్రెస్ ఆమోదం

చెన్నపురి, ఏప్రిల్ 24 : మదరాసు తమిళజిల్లా కాంగ్రెస్ కమిటీవారు ఈవాళ ఉదయం భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణ విషయమునకూ ముఖ్యముగా తమిళనాడులో నొకభాగముగానుండే మద్రాసు నగరమును విసర్జించి ఆంధ్రరాష్ట్రమును ఏర్పరచుటకును నాయకత్రయం చేసిన విజ్ఞానవంతమైన నిర్ణయమును మనస్ఫూర్తిగా ఆమోదించిరి. మదరాసు నగరమును ఆంధ్రరాష్ట్రంలో చేరవలనే పరిష్కారము గూర్చి తిరిగి చర్చచేయుటకు జరిగే ప్రయత్నములకు సభవారు ఖండించుచూ యేమైనాసరే మదరాసును ఆంధ్రరాష్ట్రంలో చేర్చకూడదని తీర్మానం గావింపబడెను.

### జూదరుల అరెస్టు

చెన్నపట్నం, ఏప్రిల్ 25 : బుల్లా సాహేబు వీధి (మన్నడి)లో సయ్యద్ ఇబ్రాహీముకు మరి 16 మందిని జూదమాడినందుకు పోలీసులు నిన్నరాత్రి అరెస్టు చేసిరి.

### దొంగతనముగా బియ్యం తెచ్చిన 4 గురు స్త్రీల అరెస్టు

చెన్నపట్నం పొన్నేరి లోకల్ బండిలో దొంగతనముగ బియ్యమును తెచ్చిన నేరమునకై 4 గురు స్త్రీలు యీవాళ బేసిన్ బ్రిడ్జిలో అరెస్టుచేయబడిరి. వారివద్ద 90 పళ్ళ బియ్యముదొరికెను.

### గవర్నరు సతి రాక

చెన్నపట్నం, ఏప్రిల్ 25: మదరాసు గవర్నరుసతి భావనగరు మహారాణిగారు ఊటీనుంచి యీవాళ ఉదయం చెన్నపురికి వచ్చిరి. వారు యీరాత్రి బొంబాయి మెయిలులో భావనగరు వెళ్ళనున్నారు.

## పాలకంపల్లి గ్రామంపై కమ్యూనిస్టుల దాడి

హైదరాబాద్, ఏప్రిల్ 25: అత్రాఫ్ బల్దా జిల్లాలోని పాలకంపల్లి గ్రామంపై సాయుధ కమ్యూనిస్టుల గుంపు ఒకటి యీనెల 21 వ దాడిచేసి అనేక ఇళ్లను దోచుకొన్నదని యిక్కడకు వార్తలు వచ్చినాయి.

## బల్గేరియా మంత్రివర్గంలో అంతరంగిక కూటమి

ప్రేగ్, ఏప్రిల్ 24 : 61 సం॥ వయస్సుగల బల్గేరియన్ వృద్ధ ప్రధాని, జార్జి డిమిట్రావ్ మంత్రివర్గంలో ఒక అంతరంగిక కూటమిని ఏర్పాటుచేసినట్టు జర్మన్ వార్తాసంస్థ విలేఖరి సోఫియానుంచి వ్రాస్తున్నాడు.

వాసిల్ కోలరావ్, అన్టన్‌యూగోవ్ మొదలైనవారు ఆకూటమిలో ఉన్నట్టుకూడా తెలియజేస్తున్నాడు.

ఇదిపూర్వం, ప్రధాని డిమిట్రావు అస్వస్థతగా ఉన్నట్టున్నూ రష్యాలో చికిత్సపొందుతున్నట్టున్నూ ఒక బల్గేరియన్ అంతరాధికార ప్రకటించబడ్డది.

## సూపర్ విమానవాహకనౌకా నిర్మాణం నిలుపుదల

న్యూయార్కు, ఏప్రిల్ 24: లోగడ అమెరికా ప్రభుత్వం ఒక బ్రహ్మాండమైన విమానవాహకనౌకను "యునైటెడ్ స్టేట్సు" అనే పేర నిర్మిస్తున్నామంటూ ప్రకటించింది. ఆ ప్రయత్నం విరమించుకున్నామంటూ మళ్ళీ ఇప్పుడు ప్రకటించింది. ఈ వార్తను అమెరికా పత్రికలన్నీ చైనా కమ్యూనిస్టు విజయాలతోపాటు మొదటి పేజీలలో ప్రకటించినవి. ఇందుకు నూరు కోట్ల డాలర్లు ఖర్చవుతుందనీ, నిర్మాణానికి నాలుగు సంవత్సరాలు పడుతుందనీ ప్రకటించారు అయితే ఇప్పుడీ కార్యక్రమం ఆపటం, యేవిధమైన ఆర్థిక ఆలోచనల దృష్టిలోనూ కాదట. ఈ నాలుగు సంవత్సరాలూ దాటేటప్పటికి ఇదియుద్ధంలో పాల్గొనటానికి యేమంత అవకాశం వుండదనుకుంటున్నారట.

సంస్థాన ప్రభుత్వ ఈ వ్యాఖ్యానాలను ఆంధ్రులకు ప్రాతినిధ్యం తక్కువగా వున్నదని ప్రజలు అభిప్రాయ పడుతున్నారనే సంగతి ఒక విలేఖరి జనరల్ చౌదరి దృష్టికి తేగా సివిల్ పరిపాలన ప్రధానోద్యోగి భార్లే సమాధానమిస్తూ, ఉద్యోగుల నియామకం ఏదైనా జరిగేటప్పుడు, ఒకరికి ప్రాతినిధ్యం ఎక్కువ, ఒకరికి తక్కువ అనే యిలాంటి ఆలోచనలు పొసగవు ఆని గాని, ప్రావీణ్యతకు సంబంధించి సంతోషము- యోగ్యతలే, పక్షపాతం యిక నుండి సహాయము చేస్తామన్నారు.

జాగీర్ల రద్దు విషయమై ముసాయిదాను, భారత ప్రభుత్వ సంస్థాన శాఖవారు పరిశీలిస్తున్నారని, యీ ముసాయిదా సంస్థాన ప్రభుత్వానికి తిరిగి రాగానే, జాగీర్దారులతో సంప్రదించిన తరువాత శాసనం చేయబడునని చౌదరి తెలియజేశారు.

# సింహళంలో భారతీయ కార్మికుల దుస్థితి

## కార్మికసంఘ సభలో గిరిగారి ప్రసంగం

హాటెన్, ఏప్రిల్ 24: సింహళ భారతీయ కాంగ్రెసు లేబరు యూనియను 8 వ వార్షిక సమావేశంలో ఇండియా హైకమీషనరు వి. వి. గిరిగారు ఇట్లు ఉపన్యసించిరి:- "సింహళ భారతీయ కాంగ్రెసుకన్న సింహళ భారతీయ కాంగ్రెసు లేబరు యూనియనే మీకు ఎక్కువ ప్రధానమైనది. సింహళ భారతీయ కాంగ్రెసు మీ రాజకీయహక్కులను సాధించడానికి కృషిచేస్తూ ఉంటే, ఈ లేబరు యూనియన్ మీ ఆర్థిక యోగక్షేమముల కొరకు పాటుపడుతూ ఉన్నది.

ప్రజా స్వామ్య ప్రభుత్వం అనే పేరుతో పిలువబడే ప్రభుత్వం ఏదైనప్పటికీ ప్రతి కార్మికునికీ జీవనభృతి చూపించవలెను. ప్రతి కార్మికుడూ కట్టుటకు బట్ట, తలదాచుకొనుటకు పంచ, జీవితమును సంతోష పథంగా నడుపుకొనుటకు వలయు సౌకర్యములూ ప్రభుత్వం తనకు అందజేయవలెనని అపేక్షించుటలో తప్పేమియూ లేదు. కాబట్టి, స్వతంత్ర సింహళ ప్రభుత్వం మీకీ సమస్తసౌకర్యములు కల్పించగలదనుకొను."

రబ్బరుతోటల ఆసాములు తమవద్ద పనిచేయుచున్న కార్మికుల సంఖ్యను తగ్గించివేయుటకు ప్రయత్నించుచున్నారని చెప్పి, గిరిగారు ఇట్లనిరి: "యుద్ధకాలంలో లాభాలు రెండు చేతులా ఆర్జించిన ఈ ఆసాములు ఇప్పుడు లాభాలు తగ్గడం మొదలుపెట్టగానే కార్మికులను తగ్గించివేయవలెనని ప్రయత్నించుచున్నారు. ప్రభుత్వముచేతనూ పారిశ్రామికులచేతనూ తమ న్యాయసమ్మతమైన కోర్కెలను తీర్పించుకొనగలందులకై కార్మికులు సంఘటితపడి సంఘీభావంతో కృషిచేయవలెను" అని గిరిగారు హితబోధ చేసిరి.

ఎస్. ఎమ్. జోషీగారు సింహళ భారతీయ కాంగ్రెసు లేబరు యూనియన్‌కు భారతీయ కార్మికుల శుభాభినందలను అందజేసిరి. "ఒకదేశపు కార్మికులకూ మరొకదేశపుకార్మికులకూ మధ్య అభిప్రాయ భేదములు అనేవి వుండజాలవు. సింహళంలో భారతీయ కార్మికులు మొదట్నుంచీ ఎలా శ్రమించి పనిచేసిందీ నేను బాగా ఎరుగుదును. అనేకమంది కార్మికులను బలాత్కారంగాకూడా సింహళానికి తీసుకొనివెళ్ళినరోజులు వున్నవి. భారతీయ కార్మికులు కంగానీలక్రింద ఇంచుమించు బానిసలుగా ఉన్నారు. పరిస్థితులు ఇప్పుడు ఇదివరకు కన్న కొంచెం మెరుగ్గా ఉన్నా, సంతృప్తికరంగా ఉన్నదని చెప్పటకు వీలులేదు. కార్మికులు సంపాదించుచున్న కూలీ పొట్టకూటికి కూడా సరిపోవడంలేదు. సింహళంలో కార్మికుల జీవితపరిస్థితులు చాలా దుర్భరంగా ఉన్నవనీ, తమ యోగక్షేమముల అభివృద్ధి కొరకు కార్మికులందరూ కలసి కట్టుగా కృషి చేయవలెననీ జోషీగారు హితబోధ చేసిరి.

"కార్మికులు దేశంలో రాజకీయమైన పలుకుబడిని సంపాదించటానికి ఆందోళన చెయ్యాలి. అయితే కేవలం శాసనసభలో స్థానాలు సంపాదించటానికి మాత్రమే పని చేయకూడదు. ఆర్థిక పారిశ్రామిక రంగాలలో బలం సంపాదించాలి. పెట్టుబడిదారీ విధానం వున్నంతకాలం కార్మికులకు కష్టాలనేవి ఉండనే వుంటయ్. పారిశ్రామికరంగంలో కేవలం బానిసలుగా కాక సమాన భాగస్వాములుగా పెంపొందటానికి కార్మికులు కృషి చేయాలి. ఈ కార్మిక సంఘానికి 70,000 సభ్యత్వబలం వున్నదని వింటానికి చాలా సంతోషించుచున్నాను. ఏకాకులుగా కాక ప్రపంచ కార్మికవర్గములతో చేయీ చేయీ కలిపి మీరు నడవండి. సింహళ కార్మిక ఫెడరేషన్‌లో మీరు చేరారని విని చాలా సంతోషిస్తున్నాను." అని జోషీ ప్రసంగించారు.

ఆచార్య కృప్లానీ ఇలా ప్రసంగించారు. "కార్మికుల పరిస్థితి భారతదేశంలోనే అధ్వాన్నంగా వున్నాయను కుంటుంటే ఇక్కడ [illegible]ంత దుస్థితి గావుంది. ఇంత తిక్కువ [illegible] కూలీరేటు ప్రపంచంలో ఎక్కడా లేదు. ప్రభుత్వము వారి శ్రామికులూ కూడా కూలీలపరిస్థితిని చక్కబరచటానికి ప్రయత్నించాలి. ఆ సమస్యను త్రోసి రాజని సెనకటికి మళ్లే సందరించటానికి ఇక ఏ విధమైన అవకాశమూ లేదు."

"ఒక్క విషయంలో మాత్రం కమ్యూనిజం కొంత మేలు చేసింది. ఇక్కడ వున్న ప్రభుత్వంగాని ఇతర పారిశ్రామిక భూస్వామిక వర్గాలుగాని ఈ విషయంపట్ల ఉదాసీనత వహించితే కల్లోలం తప్పదు. కమ్యూనిస్టు విధానంలో సున్నితత్వంగాని సూక్ష్మగాని లేవు, అహింసా సిద్ధాంతంలో వారికి నమ్మకం లేదు. ఎక్కడెక్కడ దారిద్ర్యం, అసంతృప్తి పేరుకుంటుందో అక్కడ నల్లా కమ్యూనిజం పెరుగుతుంది. భారతదేశం చుట్టూ వున్న దేశాలన్నీ కమ్యూనిస్టుల చేతుల్లోకి పోయిన దుస్థితి గమనించండి.

"గాంధీజీ మనకు హింసామార్గం లేక మరొక మార్గం చూపించారు. ఆయనకు వర్గకలహ సిద్ధాంతంలో విశ్వాసం లేదు. అన్యాయ నిరంకుశత్వాలక్రింద అణగిపోతున్న కార్మికులుగాని తదితరులుగాని నిరంకుశత్వాన్ని ద్వేషించాలిగాని, సకలమనుష్యుల్ని గాదు. పాపిని ద్వేషించకండి, పాపంగాని నిరంకుశత్వం గాని, పరిస్థితుల వల్లా, స్వార్థపరులవల్లా ఏర్పడు తున్నయ్. స్వార్థపర్ని నిర్మూలించండి.

"మీరు పోరాడేటప్పుడు ఆయుధాల కొరకు ఆసించకండి. అహింసావిధానం అవలంబించండి. ఆత్మబలి పవిత్రమైన ప్రతిఘటనామార్గం"

"ప్రతివివాదమూ, సంస్కృతి విహీనుడు ఆత్మబలి చేయగలడని నేను విశ్వసించటం లేదు. ప్రభుత్వాలూ, ధనికవర్గాలూ మధ్యేమార్గాన కలిసి సంతృప్తిపరచటానికి దిగిరావాలి. మొండితనానికి దిగితే, తప్పనిసరిగా హింసావాదాలు లేస్తవి. హింసాకాండ వల్ల మనసంస్కృతీ నాగరికతల్ని విధ్వంస మైపోవటం మినహా, సమస్య సమస్యగానే వుండిపోతుంది.

# "హిందీ రాజభాష అని రాజ్యాంగ పరిషత్తు ప్రకటించాలి"

## సేట్ గోవిందదాసు అభిభాషణ

మద్రాసు, ఏప్రిలు 24: అఖిలభారత హిందీ సాహిత్య సమ్మేళనాధ్యక్షుడు, రాజ్యాంగపరిషత్తు సభ్యుడు అయిన సేట్ గోవిందదాసు నేడు మద్రాసు హిందీ విద్యాపీఠం తాలూకు విద్యార్థి దినోత్సవమూ మద్రాసు పట్టణ హిందీప్రచారక సంఘ వార్షికోత్సవమూ జరపటానికి ఏర్పాటుచేసిన సభలో ప్రసంగిస్తూ, దేశభాష అయిన హిందీయే రాజభాష అని రాజ్యాంగపరిషత్తు ప్రకటించాలనీ, రాజ్యాంగచట్టం హిందీభాషలో కూడా తయారుచేయబడాలనీ అన్నారు.

"దేశభాషను నిర్బంధంగా ఏర్పాటు చేయరాదని పండిట్ నెహ్రూ అన్నారు. ఎట్టి నిర్బంధమూ లేకుండానే హిందీ మాతృభాషగాలేని బొంబాయి, గుజరాతు మహారాష్ట్ర, బెంగాల్, ఒరిస్సా, అసాము మొదలైన ప్రాంతాలలో హిందీ ప్రచారం అయింది. అయినా హిందీయే రాజభాషఅని రాజ్యాంగ పరిషత్తు ప్రకటించకపోతే మనం ఇంగ్లీషును వదలించుకోలేము. దేశ జనాభాలో సగంమందికి మాతృభాషగాఉండి అన్ని రాష్ట్రాలలో నూ ప్రచారం అవుతున్న హిందీ దేశభాష అనడం నిర్వివాదాంశం. దేవనాగర లిపే ఉండాలని నెహ్రూ కూడా అన్నారు. పారిభాషిక పదాలు సంస్కృతంలోనుంచే తీసుకోవాలి. కాని హిందీ లోకివచ్చిన పారసీక, అరబ్బీ, ఇంగ్లీషు పదాలను ఉండనివ్వాలి.

"తమమీద హిందీరాజ్యం ఆరోపించడానికి ప్రయత్నిస్తున్నామని దాక్షిణాత్యులు భావించరాదు. హిందీ మాతృభాషగా లేని రాష్ట్రాలలో విద్యావిధానమూ, పరిపాలనా, న్యాయవిచారణా ప్రాంతీయభాషలలో జరగడమే మా అభిమతం. ప్రాంతీయ భాషలను చంపడం మా ఉద్దేశం ఎంతమాత్రమూ కాదు. కేంద్ర శాసన సభలోకూడా వెంటనే ఇంగ్లీషు రద్దుచేసి, హిందీ ఏర్పాటుచేసి అక్కడ నియోగింపబడి ఉన్న దాక్షిణాత్యులకు ఇబ్బంది కలిగించాలని మేము ప్రయత్నించడంలేదు. దేవనాగరలిపిగల హిందీ రాజభాష అని ప్రకటించిన తరువాతకూడా పదిహేనుపదిహేను కోరినన్ని సంవత్సరాలపాటు ఇంగ్లీషు ఉండనిస్తాము.

"రాజ్యాంగచట్టం ఇంగ్లీషు భాషలో మాత్రమే నిర్మించబడినట్లయితే రాజ్యాంగంలో ఇంగ్లీషు శాశ్వతంగా ఉండిపోతుంది. దానికి హిందీ తర్జుమా ఉంటే న్నీ లాభంలేదు. అందుచేత రాజ్యాంగ చట్టాన్ని హిందీలోకూడా నిర్మించాలి." అని సేట్ గోవిందదాసు చెప్పారు.

విద్యాపీఠం యొక్క ప్రిన్సిపాలు సుందర కృష్ణమాచారియరు ప్రసంగిస్తూ దాక్షిణాత్యులు దేవనాగరలిపిగల సంస్కృత జనితమైన హిందీనే కోరుతున్నారనీ, హిందీ-హిందూస్తానీ వివాదం నాయకులదేగాని ప్రజలదికాదనీ, దేశభాషకు రాజ్యాంగపరిషత్తువారు ఏ పేరు పెడితే అదే ప్రజలకు ఆమోదకరమవుతుందనీ అన్నారు.

## రాష్ట్రపతి కార్యక్రమము

మదరాసు, ఏప్రిల్ 22: భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు 30 తేదీ సాయంత్రం బెంగుళూరు వెళ్లెదరు. మే 4, 5 తేదీలలో తిరిగివచ్చెదరని తెలుస్తుంది.

# కర్నూలు జిల్లాలో ధాన్యసేకరణ

## జిల్లా కాంగ్రెస్ సూచనలు

కర్నూలు, ఏప్రిలు 22: ఈ జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సమావేశము మొన్న మంగళవారం నందికొట్కూరులో జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు సాయకంటి శంకరరెడ్డిగారి అధ్యక్షతను జరిగెను. గత సంవత్సరం డిసెంబరు 7 వ తేదీన యేర్పాటు చేయబడిన క్షామనివారణ సంఘము కోయిలకుంట్ల, బనగానిపల్లె తాలూకాలలో చేసిన కృషిని ప్రశంసించుచూ, వారు సమర్పించిన నివేదికను చర్చించినపిదప ఆమోదించిరి. జిల్లా ఆర్థిక మహాసభను సిరువెళ్ల తాలూకాలో జరుపుటకు తీర్మానించి, అందుకు తగిన యేర్పాటులు చేయుటకుగాను ఆర్. కే. రామలింగారెడ్డిగారికి అధికారమిచ్చిరి.

జిల్లాలో అనావృష్టివల్లను, అతివృష్టివల్లను పైర్లు చెడి పురుగులు పడిపోయినందువలన ప్రభుత్వంవారు ధాన్యసేకరణ సందర్భములో సారవంతమైన భూముల నుంచి ఎకరమునకు 20 పళ్లు, నిస్సారమైన భూములవంటి 10 పళ్లు ప్రకారం వసూలు చేయవలెనని కోరుచు తీర్మానించిరి.

జిల్లాలో రాజకీయ బాధితులకు ఇంతవరకు మంజూరు చేసినభూములు ఆయా బాధితులకు స్వాధీనము కాలేదు. కావునను, యెక్కువభాగము పివాయి జమీందారుల స్వాధీనములో నున్నది. కావునను సదరు భూములను వారినుండి విడిపించి బాధితుల స్వాధీనము చేయవలెనని ప్రభుత్వాన్ని కోరుచూ ఒక తీర్మానము చేసిరి.

నందికొట్కూరు తాలూకాలోని పగిడాలచెర్వు క్రిందనున్న లగూళ్ భూములకు రేటాటి తగాదాలు వుండినని రాజకీయబాధితులు వాటికి దరఖాస్తులు పెట్టుకోగా వాటిని అమ్మకము చేయవలసినదని ప్రభుత్వపు ఉత్తరువు వచ్చినందువల్ల యీ విషయమై ప్రభుత్వము పునరాలోచించి జిల్లాలో బంజరుభూములు యెక్కువ లేనందువలన, లగూన్‌లోగాని లేక సిద్ధాపురం చెరువులోగాని మంజూరుచేసి త్వరగా వారికి స్వాధీనం చేయవలెనని కోరుచూ తీర్మానించిరి: మిగతా జిల్లాల కంటే యీ జిల్లాలో బస్సు రవాణా సౌకర్యములు తక్కువగా నున్నందున యింకను 12 రస్తాలకు బస్సులను మంజూరు చేయవలసినదని ప్రభుత్వాన్ని కోరుచు తీర్మానించిరి.

జిల్లా గాంధీ జాతీయ స్మారకనిధి సంఘ కార్యదర్శి ఆర్. కె. రామలింగారెడ్డిగారు తాలూకా సంఘములన్నియు తాము వసూలుచేసిన డబ్బును యీ నెల 25, 27 తేదిలోపల పంపవలసినదనియు డాక్టరు, రాజేంద్రప్రసాదుకు యీ నెల 30 వ తేదిన మదరాసుకు వచ్చినపుడు వారికి సమర్పించవలసి యున్నదనియు తెలుపుచున్నారు.

మున్సిపల్ హైస్కూలులో పంద్రెండు సంవత్సరములు ప్రధానోపాధ్యాయుడుగను అంతకుక్రితం యిరవై సంవత్సరములు అధ్యాపకుడుగను పనిచేసి ఉద్యోగమునుండి విరమించుకొనుచున్న జి. శివరావుగారిని సన్మానించుటకు ఈ నెల 16 న విద్యార్థులు ఒక బహిరంగసభను యేర్పాటుచేసిరి. స్కూలు పూర్వపు విద్యార్థి ఏ. రామకృష్ణారెడ్డిగారు అధ్యక్షత వహించిరి. శివరావుగారి సేవను కొనియాడుచు విద్యార్థులు వీడ్కోలు పత్రము, రజిత పళ్ళెరమును సమర్పించిరి. పి. ఆర్. వెంకట్రామయ్యగారు శివరావుగారి ఛాయాపటమును బహిరంగ పరచిరి.

ప్రస్తుత ప్రధానోపాధ్యాయుడు కే. యస్. పసుపతిగారు వందనములు అర్పించిరి. శివరావుగారు సమాధానమిచ్చుచూ, విద్యార్థులకు హితోపదేశము చేసిరి.

## చిత్తూరు జిల్లాలో కరువు పరిస్థితులు

కంచారు, ఏప్రిల్ 20: చిత్తూరు జిల్లాలో క్షామపరిస్థితులు ప్రాపకట్టుమన్నవని కాళహస్తి తాలూకాలో వర్షాభావం వల్ల పైర్లు యావత్తు యెండిపోయినవని సుమారు 60 గ్రామాలు మాత్రం పాతికా పరకా పైర్లు పండినవని కాళహస్తి తాలూకా గైరు కాంగ్రెస్ అధ్యక్షుడు మాలేపాటి వెంకటసుబ్బయ్యగారు వ్రాసిరి.

పుత్తూరు, తిరుత్తణి, చంద్రగిరి వగైరా అన్ని తాలూకాలలోను, బావులలోనీళ్ళు ఇంకిపోతూవున్నవి. అందుచేపైర్లు చాలావరకు దెబ్బతిపోవుటచే ప్రజలు అలమటించుచున్నారు. ఈ విధంగా ఈ జిల్లా అంతా క్షామపరిస్థితి పొడకడుతున్నది. కావున ప్రభుత్వము యీ జిల్లానంతను క్షామప్రాంతముగా ప్రకటించి చెరువులు పూటకాలువలకు రిపేర్లు, మైనరుప్రాజెక్టు పనులు త్వరలో ప్రారంభించునట్లు వృత్తి నప్పు చేయవలెను. బావులకు రు. 750/-లకు పైగా సబ్సిడీ యిచ్చుటయేగాక వ్యవసాయ ఖర్చులకు వడ్డీలేని దీర్ఘకాలపు బాలుకుణములను యిప్పించవలెను. పైతులపై జమీన్, యినాందార్లు జరుపుచుండు నిస్తుదారావగైరా చర్యలను నిలుపువల చేస్తూ రైతులకు కూలీలకు రక్షణజీవనోపాధి కల్పించవలెను. అని వారువ్రాసిరి.

# జీవితంలో మతానికి ప్రాధాన్యం

## బొంబాయి సమావేశ విజ్ఞప్తి

బొంబాయి, ఏప్రిల్ 24: ప్రతిదేశ ప్రభుత్వమూ మానవుని ఆత్మ స్వాతంత్ర్యమును వ్యక్తిత్వ గౌరవమును దేశ శాసనములద్వారా పదిలమూగా, సంరక్షించ వలెనని, నేడిక్కడ ద్వితీయ సమావేశమును జరుపుకొనచున్న అఖిలమత పరిషత్తు ఒక నివేదికలో ప్రపంచ రాజ్యములకు విజ్ఞప్తి చేసెను. ఈ సమావేశమునకు డా॥ ఎస్. రాధాకృష్ణయ్యగారు అధ్యక్షతవహించిరి. నివేదికలో ఇంకా ఇలా ఉన్నది:— "ప్రపంచ మంతటా భౌతిక వాదం విపరీత వేగంతో వ్యాపించి పోవుచున్నది. కమ్యూనిజమూ ఫాసిజమూ అనేవి ఈ వాదంలో నుంచి పుట్టిన వక్రితలే. నైతిక విలువలను కూలద్రోయుటకు, తద్వారా మానవ సమాజము యొక్క అస్తిత్వానికే ముప్పు తెచ్చుటకు ఈ వాదం ఉపకరించు చున్నది. అభ్యుదయ మార్గగామియై సౌఖ్యమును వాంఛించే ఏ సమాజమునకైనా భగవంతునిపై విశ్వాసము, నైతిక ప్రమాణములలో నమ్మకము అత్యవసరం. ప్రపంచంలోని మతములన్నిటి యందు ఈ విశ్వాసము అనుస్యూతమై యున్నది. మతములలో గూడు కట్టుకొని యున్న మూఢ విశ్వాసములను ప్రాబడిన ఆచారబంధనములను త్రెంచివేయవలెను. నైతిక ప్రమాణముల అనుష్ఠానముద్వారాను భగవద్విశ్వాస ప్రేరణ ద్వారాను మానవుని అంతఃకరణను జాగరిత మొనర్చవలెను. మతములను ఆచారములను రాజకీయోద్యమములకు ఉపయోగించుకొనుట ఎంతయు గర్హ్యము."

ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వముగల రాజ్యములన్నీ సమితి ప్రణాళికలో మతమునకు సంబంధించి చెప్పిన ప్రాతిపదిక హక్కులను విధిగా సంరక్షించవలెనని పరిషత్తు కోరింది. ఈ హక్కులను రాజ్యాంగములోనే అంతర్భాగముగా చేర్చినందుకు ఇండియాను పరిషత్తు అభినందించింది.

పరమత సహనమునకు ఇండియా పుట్టినిల్లు అనే అనాదిగా వస్తున్న ఈ ఉదార సంప్రదాయమును విదేశములు అందు అనుకరించ వలెనని కోరదగినది. ఆలోచనా స్వాతంత్ర్యమునకు హింసా విరహితమైన క్రియా స్వాతంత్ర్యమునకూ ఎట్టి పరిస్థితులలోనూ భంగపాటు కలుగ నివ్వకూడదనీ, ఆత్మను భూమిని పవయగోరు మానవుని జీవిత యాత్రా లక్ష్యం ధరించవలెనంటె ఈ స్వాతంత్ర్యములను సంరక్షించుట అత్యంతావశ్యకమనీ వారా నివేదికలో ఉద్ఘాటించిరి.

## బాలికాపాఠశాల వార్షికోత్సవము

హిందూపురము, ఏప్రిల్ 20: ప్రభుత్వబాలికా మాధ్యమిక పాఠశాల వార్షికోత్సవము పెనుగొండ సబ్‌కలెక్టరు సి. ఎస్. కృష్ణమూర్తిగారి అధ్యక్షతను మొన్న జరిగెను. హెడ్ మిస్ట్రెస్ మిస్ శాంసన్‌గారు పాఠశాల వార్షిక నివేదికను చదివి అందుపాఠశాల సాధ్యమైనంత త్వరలో ఉన్నతపాఠశాలగా మార్చుటకు వలసిన సౌకర్యములు, సహకారములు, అధికార అనధికారులు యివ్వవలసి యుండునని విన్నవించిరి. తర్వాత పాఠశాల జౌన్నత్యమును గూర్చి యూ, శ్రీ ఉన్నత విద్యానుసరించి యు కె. వి. శేషయ్య (మునిసిపల్ చేర్మను) రామ కృష్ణయ్య, దొంతిభీమయ్య, సురమూర్తి, వెంకటరత్నంగార్లు ఉపన్యసించిరి. అధ్యక్షులు మాటలాడుచు పాఠశాల ఉన్నత పాఠశాల అగుటకు తాము ప్రభుత్వము తరపున కావలసిన పనిచేసెదమనియు, మునిసిపాలిటీవారు, ప్రజలు అధికంగా తోడ్పడి సదరీపాఠశాలను అభివృద్ధికి తీసికొని రావాలనియు తెలిపిరి. మిసెస కృష్ణమూర్తిగారు పాఠశాల బాలికలకు బహుమతులు పంచిపెట్టిన తర్వాత పాఠశాల బాలికలు "శాకుంతల" అను నాటకమును ప్రదర్శించిరి.

## రాష్ట్రంలో ధాన్యసేకరణ

చెన్నపట్నం, ఏప్రిల్ 23: చెన్నరాష్ట్రంలో ఏప్రిల్ 16 వ తేదీతో అంతమైన వారమునందు ధాన్యసేకరణ అంతకు ముందు వారములో కంటే కొంతఎక్కువయ్యెను. పైవారమునందు 27182 టన్నులును తత్పూర్వ వారములో 24536 టన్నులధాన్యం లభించెను. పశ్చిమ గోదావరిలో 6673 టన్నులు, తంజావూరులో 6591, కృష్ణాలో 3187 టన్నులు సేకరింప జడినవి.

ఈ వారమున 497951 టన్నుల ధాన్యం నిలవయుండెను. ఇది వెనుకటి వారములోనుండిన 502372 టన్నులకంటే తక్కువ. మదరాసు నగరమునకు 48 రోజులకు సరిపోయే నిలవయున్నది.

# ఆదిమవాసులయెడ ప్రభుత్వ కర్తవ్యం

## ఆంధ్రరాష్ట్ర ఎరుకలమహాసభలో ప్రసంగాలు

మైలవరం, ఏప్రిల్ 20: ఆంధ్రరాష్ట్ర ఎరుకల 6వ మహాసభ 17న నిచ్చట పొన్నా కోటేశ్వరరావుగారి అధ్యక్షతను జరిగింది. సభకు పలుప్రాంతాలనుంచి షుమారు 400మంది సంఘసభ్యులు వచ్చారు. సికింద్రాబాద్‌నుంచి సంఘనాయకులుఏడుగురు సౌహార్ద్రప్రతినిధులుగా వచ్చారు.

మధ్యాహ్నం ప్రతినిధుల సమావేశం జరిగింది. ఎరుకలలాగే, సమాజంలో అధఃపతితులైవున్న ఆదిమవాసులు అభివృద్ధికి సంబంధించిన తీర్మానాలు చెయ్యబడ్డవి. నూతన కార్యనిర్వాహకవర్గ ఎన్నికకూడా జరిగింది.

తదనంతరం ఊరేగింపు తర్వాత మహాసభ ప్రారంభమయింది. సికింద్రాబాద్ సంఘనాయకులు కె. గంగయ్యగారు సభను ప్రారంభించుచు, విద్యావిజ్ఞానవంతులైన నాయకుల అధ్వర్యాన రాష్ట్ర ఎరుకల మహాసంఘంలో సంఘటితమై, చైతన్యవంతులౌతున్న ఎరుకలవారి స్థితిగతులకు హర్షిస్తూ, ఆంధ్రలోకంపై అన్ని విధాలా వెనకబడివున్న హైదరాబాద్ సంస్థానంలోని 50వేలమంది ఎరుకలవారి అభ్యున్నతికై రాష్ట్ర ఎరుకలమహాసంఘంవారు తగినసహాయం, చేయూతనివ్వాలనికోరుతూ, ఆంధ్ర ప్రజా కోటి వాంఛిస్తున్న విశాలాంధ్ర యేనాటికైనా యేర్పడుతుందనీ అప్పుడేర్పడిన రాష్ట్రంలో తెలంగాణా కూడా కలసిపోతుందనీ, నేటి తెలంగాణా ఎరుకలవారంతా ఆనాడు ఆంధ్రరాష్ట్ర ఎరుకల మహాసంఘంలో తప్పక కలిసి తీరుతారనీ అన్నారు. సహకార పరపతిసంఘాలద్వారా ఎరుకలవారికి నివేశన స్థలములు మంజూరుచేసి, గృహవసతులు కల్గించి, అభివృద్ధికి తీసుకురావాల్సిందిగా ప్రభుత్వంవారిని కోరుతూ తమ ఉపన్యాసాన్ని ముగించారు.

అనంతరం చిత్తూరుజిల్లా ఎరుకలసంఘ నాయకులు పూలకృష్ణన్, వి. గంగయ్య, డి. రెడ్డెప్పగార్లున్నూ, సికింద్రాబాద్ సంఘ నాయకులు కె. వంకయ్య, బాబూరావుగార్లున్నూ, గుంటూరుజిల్లా ఎరుకల సంఘ నాయకులు గజ్జెల కృష్ణన్, రాష్ట్ర ఎరుకలసంఘ నాయకులు పొన్నా సత్యనారాయణ, కృష్ణాజిల్లా ఎరుకలసంఘ కార్యవర్గ సభ్యురాలు శ్రీమతి ఏసు కృపగార్లున్నూ ఎరుకల జాత్యభివృద్ధికి సూచనలుచేస్తూ ఉపన్యసించారు.

పిమ్మట అధ్యక్షుడు ప్రసంగిస్తూ, ఎరుకల, యానాది, లంబాడి, కోయ మొదలు గాగల ఆదిమవాసులంతా అనాదినుంచి ప్రాథమిక జీవన వసతులులేక సమాజంలో అధఃపతితులై ఉన్నారనీ, అందుకు పైకులాలవారి చిన్నచూపు, ఈ జాతుల్లోని సనాతన దురాచారాలు, మూఢ కట్టుబాట్లు, ప్రభుత్వపు నిర్లక్ష్యం, నిరాదరణలే మూలకారణాలన్నారు. ఏమైనా, ఆదిమవాసులకు బంజరుభూములు మంజూరు చేసి, మన రాష్ట్రంలో బంజరుగా పడివున్న కోటి యేభైలక్షల ఎకరాల బంజరుభూమి నంతటినీ ఆధునిక వ్యావసాయక పనిముట్ల నుపయోగించి సాగులోనికి తెచ్చి రామపాదసాగర్, కృష్ణా-పెన్నార్ మున్నగు ప్రాజెక్టులనుకట్టి నీటివసతులు కల్పించి, అధికాహారోత్పత్తిని సాధించనప్పుడే ఆదిమవాసుల జీవిత పరిస్థితిచక్కబడుతుందనీ, ఆనాడు మనదేశం స్వయంపోషకం కాగలదనీ హెచ్చరించారు. ఏజెన్సీవాసులైన కోయ, యిత్యాది ఆదిమవాసుల జీవనోపాధిని ఆటంక పరుస్తున్న గొడ్డలిపైని నిషేధం, ముదాదార్ల పద్ధతి, ఋణబానలను తొలగించి, వారి అభివృద్ధికి పాటుబడవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు. కమ్యూనల్ జీ. వో. అమలును మరికొంతకాలంపాటు పొడిగించినందుకు ప్రభుత్వంవారిని అభినందిస్తూ, దేశంలో మూడుకోట్లకు పైబడివున్న ఆదిమవాసులను యిప్పటిస్థితిలోనేవుంచక, వారికి జీవన వసతులను కలిగించి, అన్ని విధాలా అభివృద్ధిపరచినప్పుడే, ఆదిమవాసులు సమాజంలో తమకున్న స్థానాన్ని ఆక్రమించుకోగలుగుతారని, ఆనాడే దేశానికి నిజమైన సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించినట్లనీ, అందుకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు పూర్తి బాధ్యతతో కృషి చేయాలని ప్రభుత్వంవారికి విజ్ఞప్తిచేస్తూ, రాష్ట్ర ఎరుకల మహాసంఘంలో చేరి సంఘటిత ఉద్యమంద్వారా తమ హక్కులను సాధించుకోవాలనీ సాంఘికులను హెచ్చరిస్తూ తమ ఉపన్యాసాన్ని ముగించారు.

రాష్ట్ర ఎరుకల మహాసంఘం ప్రధాన కార్యదర్శి రామేశ్వరం నాగయ్యగారు వార్షిక నివేదికను చదివారు.

అనంతరం అధ్యక్షులు గాంధీస్మారకనిధికై సభికులకు విజ్ఞప్తిచేయగా రూ 8-5-0 లు వసూలయింది.

నేరపజాతుల చట్టాన్ని, అలవాటుపడిన నేరస్థుల చట్టాన్ని పూర్తిగా రద్దు చేయాల్సిందిగా కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలను కోరుతూనూ, కమ్యూనల్ జీ. వో. ను అమలుపరచడాన్ని మరికొంతకాలంపాటు పొడిగించినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తూనూ, ఎరుకల, యానాది, లంబాడీ ఆదిగాగల ఆదిమవాసు లందరినీ నిమ్న జాతుల్లో చేర్చి, విద్యా ఉద్యోగాది విషయాల్లో వీరిని హరిజనులతో సమంగా చూడాలనీ, సహకార పరపతి సంఘాల ద్వారా వీరికి బంజరుభూములను, తదితర వ్యవసాయ పనిముట్లను యిచ్చి వీరి ఆర్థిక దుస్థితిని తొలగించవలసిందిగానూ, చెన్నరాష్ట్రంలోని క్రిమినల్ సెటిల్మెంటులను వ్యవసాయ కాలనీలు గామార్చి, కో-ఆపరేటివ్ పద్ధతిపై అచ్చటివారికి బంజరు భూముల నిచ్చి చేతిపనులు కల్పించి, ప్రోత్సహించవలసిందిగానూ, హరిజనులకువలె ఆదిమవాసులకు కూడా ప్రత్యేకశాఖను నెలకొల్పి, హరిజననిధివలె 1 కోటిరూపాయలను వీరికికూడా ప్రత్యేకించాలనీ కోరుతూ తీర్మానాలు చేయబడ్డవి. నాయకత్రయంవారి నివేదికయెడల తమనిరసనను తెలియజేస్తూ, కాశ్లీ, చేరులు, తలచేరి మొండేదవంటి ఆంధ్రరాష్ట్రం తమకవసరంలేదనీ, తెలుగుగడ్డలన్నిటితో కూడిన విశాలాంధ్ర నిర్మాణానికై ఆంధ్ర ప్రజానీకం, ఆంధ్ర శాసనసభ్యులు అంతాకలిసి ఆందోళనచేయాలని ఆంధ్ర ప్రజానీకానికి విజ్ఞప్తిచేస్తూ మరోతీర్మానంగూడా చేయబడ్డది.

ఆదివాసుల క్షేమాభిలాషి చిర్రావూరి నాగభూషణాచార్యులుగారు, మరికొందరుప్రముఖులు పంపినసందేశాలు సభలో చదివారు.

రాత్రికిమున్నెండుక, పద్దులు, మున్నగు వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగినవి. సభ, వైజ్ఞానిక కార్యక్రమాలకు షుమారు 3000 మంది ప్రజలు వచ్చారు.

నూతనసంవత్సరానికి పొన్నా సత్యనారాయణగారు అధ్యక్షులుగను, రామేశ్వరం నాగయ్యగారు ప్రధాన కార్యదర్శిగను, పూలమునియప్ప, పాలపర్తి వీరయనగార్లను, ఉపాధ్యక్షులుగను, చవల జానకిరామారావు, యస్. యస్. నరసింహంగార్లను సంయుక్త కార్యదర్శులుగను మరి యితరులైన మన్నగు సభ్యులలోకూడి కార్యవర్గాన్ని యెన్నుకొనడమయింది.

# ఆర్. యస్. యస్. నిబంధనావళి

## భారతప్రభుత్వానికి గోల్వాల్కర్ సమర్పణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: ప్రస్తుతం సోయని జైలులో నిర్బంధితుడుగానున్న ఆర్. యస్. యస్. సర్వసంఘచాలక్ గోల్వాల్కర్, ఆర్. యస్. యస్. నిబంధనావళిని, సి. పి. ప్రభుత్వంద్వారా భారత ప్రభుత్వానికి పంపినట్లు నేడిక్కడ తెలియవచ్చినది. టి. ఆర్. వెంకటరామశాస్త్రి కొంతమంది రాష్ట్రీయ స్వయంసేవక సంఘ కార్యకర్తలతో సమాలోచించి, ఆర్. యస్. యస్. నిబంధనావళిని రచించి యింతక్రితమే భారతప్రభుత్వానికి సంపించాడు. కాని యీ నిబంధనావళి సరాసరి ఆర్. యస్. యస్. ముఖ్యనాయకుని వద్దనుండి రాలేదనే కారణంతో, దీని ననుసరించి భారతప్రభుత్వం యెట్టి చర్య తీసుకొనలేదు.

# ఆసియాలోని వలస దేశాల స్వాతంత్ర్యం

## భారతప్రభుత్వ లక్ష్యమని కేస్కర్ ప్రకటన

సింగపూరు, ఏప్రిల్ 24: భారత ప్రభుత్వ విదేశాంగశాఖ సహాయమంత్రి డాక్టర్ కేస్కర్ ఈ ఉదయం ఇక్కడికి వచ్చారు. వీరు ఆగ్నేయాసియా రాజ్యాలన్నీ పర్యటించి, అక్కడ భారతీయుల స్థితిగతులను విచారించి, అవసరాలను తెలుసుకొని భారతప్రభుత్వానికొక నివేదికను సమర్పిస్తారని తెలుస్తున్నది పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ ఆసియాలో ఇంకా అస్వతంత్రంగా ఉన్న దేశాల దాస్యవిముక్తి చేయడం స్వతంత్రభారత లక్ష్యాల్లో ఒక్కటన్నారు. వలస విధానం పోవాలని తాము నమ్ముతున్నామన్నారు. వలసరాజ్యాలనేకంలో ప్రజలింకాస్వపరిపాలన కర్హులుకానిమాట యథార్థమే కావచ్చునుగాని ప్రాజాపత్యం వహించిన రాజ్యాలు, ప్రజలు స్వపరిపాలనకు అర్హులయ్యేటట్లు తయారుచేయవలసి ఉంటుందన్నారు.

చైనాలో కమ్యూనిస్టు విజయ ప్రభావం గురించి ప్రశ్నించగా భారతదేశంపై ఒత్తిడి ఎక్కువ కావచ్చుననీ, భారత ప్రభుత్వం పరిస్థితులను అత్యంత శ్రద్ధతో పరిశీలించుచున్నదని డా॥ కేస్కర్ సమాధానం చెప్పారు.

# కృష్ణా స్నానానికని తీసుకువచ్చి నగలు అపహరించుట

విజయవాడ, ఏప్రిల్ 23: కృష్ణా స్నానానికని ఒకస్త్రీని మచిలీపట్నం నుంచి ఇక్కడికి తీసుకువచ్చి ఆమె వద్దనున్న సుమారు వెయ్యిరూపాయలనగలను అపహరించినందుకుగాను గూడె జగన్మోహనరావు, అబ్బిరి వెంకటేశ్వరరావు అనువారలను టౌన్ స్టేషన్ సబిన్‌స్పెక్టరు జి. వెంకటప్పయ్య 380 ఐ. పి. సి. క్రింద అరెస్టు చేశారు.

జగన్మోహనరావు మచిలీపట్నం కొత్తపేట వాస్తవ్యురాలైన గంపల శేషరత్నం అనే స్త్రీని కృష్ణలో స్నానానికని ఇక్కడికితీసుకువచ్చాడట. స్నానాదికం పూర్తి చేసుకొన్న తర్వాత, సాయంత్రం అతడు ఆమెను స్నానానికి స్నానాలగదికి పంపి, ఆమె పెట్టె పగలకొట్టి అందులోని వెయ్యిరూపాయల నగానట్రా కాజేశాడట. ఇది జరగటానికి ముందు అబ్బిరి వెంకటేశ్వరరావు అనువాతడు వచ్చి జగన్మోహనరావుతో కొంతసేపు మాట్లాడాడట. ఫిర్యాదుపై పోలీసులు దర్యాప్తుచేసి ఈ ఇద్దరినీ అరెస్టుచేశారు. పోయిన నగలన్నీ దొరికాయి. (స్వ. వి.)

# రేడియో ప్రోగ్రాములు

## సంగీతాది కాలక్షేపాలూ, ప్రసంగాలూ మొదలైనవి

(ఏప్రిల్ 27 బుధవారం)

మద్రాస్ (1): ఉదయం 7-30 ఎస్. కృష్ణవేణి వీణ. మధ్యాహ్నం 12-30 ఎస్. రాజరత్నం వైలన్. సాయంకాలం 5-30 ఇందిరాబాయి ఖిలేక్కార్ పాటలు 6-20 అభిశంకరన్ గాత్రం. రాత్రి 8-30 కలక్కాడ్ ఎస్. మహాదేవన్ గాత్రం. 9-15 'కల్చరల్ ఎమినిటీస్' గురించి ఎస్. చంద్రశేఖరయ్య ఇంగ్లీషు ప్రసంగం.

మద్రాస్ (2): ఉదయం 7-15 అరియకుడి రామానుజయ్యంగార్ పాటల రికార్డులు. 8-30 ఎ. గోవిందపట్టి గాత్రం. మధ్యాహ్నం 2-45 ఈమనిశంకరశాస్త్రి వీణ (రికార్డులు) సాయంకాలం 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 'సహకారసంఘాలు పంపకము' గురించి ప్రభుత్వ సహాయకాధికారి ప్రసంగం. గాజు పరిశ్రమ గురించి వడ్లపట్ల దుర్గాప్రసాదరావుగారి ప్రసంగం. రాత్రి 8-0 చిత్తయజగత్తు 9-30 'షికారీ' పాటల రికార్డులు.

విజయవాడ:—ఉదయం 7-15 వి. అన్నపూర్ణ గీతావళి. 7-30 హరిహరనాథశాస్త్రి, హరి అచ్యుతరామయ్యశాస్త్రి వైలన్. 8-15 మహేంద్రవాడ బాపన్నశాస్త్రి గాత్రం. సాయంకాలం 5-30 హరికొవదుల వైలన్. 6-20 అన్నపూర్ణ గేయాలు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. మద్రాసును రిలే. 7-15 మన సంగీత సాంప్రదాయను శీర్షికను "త్యాగరాజకవులు: సంకీర్తన పద్ధతి" అని విషయముపై వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రసంగం రాత్రి 8-0 వర్లా మిని పి. రామశర్మ వీణ. 8-30 మహేంద్రవాడ బాపన్నశాస్త్రి, గాత్రం. 9-15 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి పాటల రికార్డులు. 9-30 రామశర్మ వీణ.

హైదరాబాద్: ఉదయం 8-35 మూర్జహాన్ బేగం సంగీతం. మధ్యాహ్నం 12-30 ఫిలిం భజనలు. సాయంకాలం 5-0 నుంచి 5-50వరకు పాటలు 6-30 పట్నవాసులకు తెలుగుకార్యక్రమం. 'కుంకుమ రేఖలు', 'పురాణాలలో స్త్రీలు' గురించి కె. వి. రత్నాకరమ్మ ప్రసంగం. 7-15 గ్రామస్థులకు తెలుగు కార్యక్రమం. ఉద్యానకృషి గురించి బి. వి. రమణరావు ప్రసంగం. వృత్తివిద్య గురించి బాబు శ్రీనివాసరావు ప్రసంగం. 7-45 కాయమా నెను గురించి డాక్టర్ హుస్సేన్ జహీర్ ఇంగ్లీషు ప్రసంగం. తర్వాత రాత్రి 11-0 వరకు పాటలు వగైరా.

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 25:

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు (కొత్తది) రు. 170-8-0

వేరుసెనగకూ ఎక్స్‌పెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 341-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్స్‌పెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | |
|---|---|
| మొదటి రకం | రు. 350-0-0 |
| రెండవ రకం | రు. 310, 543 |

| | |
|---|---|
| టెంకాయనూనె (39 పౌను గల డబ్బా) ఒకటికి | రు. 33-8-9 |

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 74-4-0 పెట్లా బంగారు తులం 114-4-0 మూసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-5 (రెడీ) 182-0-0 వెండి తులం 1 కి 1-13-6.

పంచదార

| | |
|---|---|
| "కామ్పూరు" (2 అందరు) | రు 90-4-0 |
| అనకాపల్లి" (2 అందరు) | 89-2-0 |

## టెలిఫోను ఆపరేటర్ల శిక్షణాలయం

### మదరాసు ప్రధానిచే ప్రారంభోత్సవం

మదరాసు, ఏప్రిల్ 24: టెలిఫోను నవీన శాస్త్రపరిశోధనలలో నొక మహత్తరమైన పరిశోధన. మానవునికి సుఖము చేకూర్చు శాస్త్రపరిణామములలో ఇది ఒక ప్రధానమైన లింకు. మానవుని కార్యకలాపముల స్వభావమునే పరివర్తనము చేసినది. మానవుడు సంఘజీవి. సాంఘిక సంబంధములకు కమ్యూనికేషను ఒక మర్మము. ఈ రంగంలో శాస్త్రము వల్ల అనేకమైన ఆశ్చర్యములు వెల్లడి అయినవి. కొన్ని సంవత్సరముల క్రింద వారికి ఇవి మాయగ కనిపించవచ్చును. ఇప్పుడు మనుష్యులు అనుభవిస్తూవున్న సౌకర్యములను పాతకాలమువారు తలచి చూచి వుండరు అని మదరాసు ప్రధాని శ్రీ పూసపాటి కుమారస్వామి రాజా ఇవ్వాళ సాయంత్రం టెలిఫోను ఎక్స్చేంజికి సంబంధించిన స్కూలుకు ప్రారంభోత్సవము చేయుచు చెప్పిరి.

టెలిఫోను అవతరణతో మానవుని సంఘ కార్యక్రమమును విపరీతముగ వృద్ధి అయినవి. ఇందులో ట్రంకు టెలిఫోను మరొక మెట్టు. ఇండియాలోని ప్రధాన నగరములన్నీ ట్రంకు టెలిఫోనుద్వారా కలుపబడినవి. విదేశములనుండి వార్తలు తీసుకొనుటకు, పంపుటకు యేర్పాటు చేయబడినది. మీట నొక్కుటవలన, డయల్ త్రిప్పుటవలన మనిషి భూభాగములో ఎక్కడో వున్న మరొక మనిషితో మాట్లాడవచ్చును. నక్షత్ర మండలము, చంద్రమండల వార్తలను విను రోజులు మారములో లేవు, ఇండియాకు రాజ్య కాంక్ష లేకపోయినా అక్కడ మనం రాజ్యం స్థాపించవచ్చును అని అన్నారు.

టెలిఫోనువల్ల వ్యక్తులకేగాక దేశము నకుకూడ సౌభాగ్యము చేకూరినది. వార్తా ప్రసరణ శీఘ్రమెనర్చుటవలన వర్తక వ్యాపారముల అభివృద్ధికి తోడ్పడినది. టెలిఫోను విషయములో మనదేశ మింక నూ బాలావస్థతో వున్నది. అభివృద్ధి చేయవలెనని ఇండియా ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నారు.

ఈ సందర్భమున ఒకవిషయము తప్పక చెప్పవలసియున్నది. దేశమునకు కావలసిన టెలిఫోను సామగ్రిని తయారు చేయుటకు తగిన ఫాక్టరీని బెంగుళూరులో నిర్మించుటకు ఒక పెద్దస్కీము సిద్ధముగ యున్నది.

టెలి కమ్యూనికేషనులు వృద్ధిఅయిన కొద్దీ అందుకు అవసరమగు శిక్షణ పొందిన సిబ్బందిని తయారుచేయవలసి యున్నది. ఇటువంటి శిక్షణాలయములలో శిక్షణ పొందువారికి క్రమశిక్షణ చాల అవసరము. ఇక్కడ విద్యార్థులందరు క్రమశిక్షణ అలవర్చుకొనవలెనని కోరుచున్నాను, అని ప్రధాని అనిరి.

మదరాసు టెలిఫోన్సు మేనేజరు శ్రీ చిబ్బా సభికులను ఆహ్వానించుచు ఈ శిక్షణాలయము రాష్ట్రములోని 60 ఎక్స్చేంజిలనుండి వచ్చు సుమారు 400 మందికి శిక్షణ ఇచ్చుటకు ఉద్దేశించబడినది. నిర్ణీత పాఠ్యక్రమము ననుసరించి నాలుగు వారములు శిక్షణ ఇవ్వబడుచుండు. సీనియర్ ఆపరేటర్లకు అవసరమగు శిక్షణకూడ ఏర్పాటు చేయబడినదని చెప్పిరి.

నగరములోని వాణిజ్య సంఘాధ్యక్షులు, సలహా సంఘసభ్యులు హాజరయిరి.

స్కూలు ప్రారంభోత్సవము అనంతరము సభికులకు టెలిఫోను భవనములో అల్పాహార విందొసగబడెను.

జనరల్ మేనేజరు చిబ్బా సభికులకు టెలిఫోను సిష్టమునంతనూ చూపించి ఎట్లు పని జరుగునదీ వివరించిరి.

### రైలుపెట్టెల మెట్లమీద ప్రయాణము చేసినందుకు శిక్షలు

ఈనెల 7 వ తేదీన ఉదయ కోచ్చిలో చీరాల స్టూవర్టుపురం స్టేషనులమధ్య రైలు పెట్టెలమెట్లమీద నిలువబడి ప్రయాణం చేసినందుకు ఒంగోలు రైల్వేపోలీసువారు 16 మంది ప్రయాణీకులను పట్టుకొని వారిమీద రైల్వేచట్టంక్రింద చార్జీ పెట్టిరి. బాపట్ల సబ్ మేజస్ట్రేటుగారు ముద్దాయీలను విచారించి ఒక్కొక్కరికి ఒక్కరూపాయి జరిమానా విధించిరి.

### కోస్తాదుతాలూకా కోయల ఇబ్బందులు

అఖిలభారత ఏజెన్సీ ప్రజలసంఘ కార్యదర్శి వి. వి. రంగాచార్యులుగారు మత్స్యనిషేధమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారిని సుక్రవారం దర్శించి కోస్తాదుతాలూకా సంబంధించిన ఇతర గ్రామముల కోయలు మత్స్యనిషేధముల్ల పనులకు, వివిధ సమస్యలనుగూర్చి విన్నవించిరి. మంత్రిగారు సావధానముగావిని లేఖచర్య గైకొనెదమనిరి.

## గాంధీ గాథాలహరి

### కాకా కలేల్కరుగారి సంచారము

అహమ్మదాబాదు, ఏప్రిల్ 23: గాంధీ మహాత్ముని జీవితకథా విశేషముల నన్నింటిని సేకరించినవానిని గాంధీ స్మారక నిర్వ హణాల మండలివారు మహాత్ముని సంబంధించిన కాకా కలేల్కరుగారికి ఒప్పజెప్పిరి. కలేల్కరుగారు సౌరాష్ట్రమందు పర్యటన చేసి నేడు అహమ్మదాబాదుకు వచ్చిరి. అచట వారు మహాత్ముని సహాధ్యాయులుగ నుండినవారిని, ఆయనతో బాల్యమునందు కలిసి మెలిసి తిరిగియుండిన వారిని కొందరిని కలిసికొని మాట్లాడిరి. మహాత్ముని జన్మస్థానమైన పోర్బందరులో కస్తూరీబాయి గాంధీ జననమైన గృహమును చూచిరి. ఆ యింటిని కూడ శాశ్వత స్మారకచిహ్నముగా కాపాడవలెనని చెప్పిరి.

కలేల్కరుగారు దక్షిణాఫ్రికాకు పోదలంచియున్నారు. అక్కడ గాంధీజీ కుమారుడైన మణిలాలు గాంధీ కలడు. గాంధీమహాత్ముడు దక్షిణాఫ్రికాలో మొట్టమొదట ఫోనిక్సు ఆశ్రమమును ఏర్పాటుచేసెను. దాని నిప్పుడు మణిలాలుగాంధీ నిర్వహించుచున్నాడు. గాంధిమహాత్ముని శాశ్వత స్మారక చిహ్నములలో నొకటిగా యీ ఆశ్రమమును భద్రముగా కాపాడుటకు కలేల్కరుగారొక ప్రణాళికను తయారు చేయుచున్నారు.

కలేల్కరుగారిట్లు చెప్పిరి: గాంధీ మహాత్ముని జీవితగాథలతో సంబంధంగల చరిత్రాత్మకమైనవానిని, అభిమానాను రాగపూర్వకమైనవానిని అనేక వస్తువులను సేకరించి భారతదేశములో అనేక ప్రాంతములందు గాంధీవస్తుప్రదర్శనశాలల నేర్పాటు చేసి ఆ ప్రదర్శనశాలలో ఆ వస్తువులన్నింటిని ప్రదర్శించవలెనుసను. అట్టి ప్రదర్శనశాల ఏర్పాటుకై నేను ప్లానులు తయారు చేసితిని. అట్టి ప్రదర్శనశాలయొక్క ప్లాను రాట్నము ఆకారముగా నుండును. ఆ రాట్నమునే ఆధారసూత్రముగా స్వీకరించి గాంధిమహాత్ముడు తన తత్వోపదేశమునంతను క్రోడీకరించెను. మహాత్ముడు అనేక పర్యాయములు దేశమంతటను పర్యటనము చేసినప్పుడు అనేక భవనములందు అతిథిగా మకాముచేసెను. ఆగృహములన్నిటిలోకి మేముపోదలచుకోలేదు. కాని, ఏదైనా ప్రజాసంస్థలయందు ఆయన జాతీయోద్ధరణార్థమైన కార్యములను చేసియుండినయెడల అట్టి భవనములందు చలువరాతి శిలాశాసనములను చెక్కించి గోడలలో బిగించవలెను. గాంధీపుస్తక భాండారములను నెలకొల్పి పాఠకవర్గ కూటములను ఏర్పాటుచేయవలెను. అట్టి భాండారములందు గాంధీ విరచిత గ్రంథములను మహాత్మునిగురించి వ్రాయబడిన గ్రంథములును ఉంచబడును. గాంధిమహాత్ముని తాలూకు వస్తువులను ఆయన గ్రంథములును ఒక స్పెషలు రైలు బండిలో ప్రదర్శనశాలగా అమర్చి దేశమంతటను ఆ రైలుబండిని త్రిప్పవలెను సంకల్పమొకటికలదు. వెనుకబడియున్న జాతులవారిని పీడితజనవర్గములను ప్రత్యేకంగా ఆదరించుచు, సర్వజన శ్రేయోభివృద్ధికై అహింసా సూత్రానుసారము కృషిచేయునట్టి సర్వోదయ సంస్థయొక్క తత్వోపదేశమును ప్రపంచమంతటను ప్రచారముచేయుటకై గాంధిమహాత్ముని జీవితగాథాలహరికి యోచిస్తాము లన్నియు ప్రభోధసాధనములుగ భద్రపరచబడుచున్నవి. అత్యధిక సంఖ్యాకుల అత్యంత శ్రేయమే పరమధర్మమనెడి ఉపదేశమునకు పోటీగా ప్రతి కూలముగా సర్వోదయసిద్ధాంతము వర్తించుచున్నది. అత్యధిక సంఖ్యాకుల అత్యంత శ్రేయమే పరమధర్మమనుటవల్ల అధిక సంఖ్యాకుల మాట చెలామణియై అల్ప సంఖ్యాకులను పీడించుచుండుట సత్యమనియు సహింపదగినదనియు అగుచున్నది. అనుముస్థులను కడజాతి వారిని కూడా ఉద్ధరించునట్టిదే సర్వోదయ సిద్ధాంతమని ఉన్నటింపబడినది. మహాత్ముని సిద్ధాంతములను ప్రచారంచేయుటకై మతబోధకుల వలె కొందరిని యితర దేశాలకు పంపవలెనను ఉద్దేశము మాకు లేదు. కాని మహాత్ముని ధర్మసూత్రములను భారత దేశములోనే అనుష్ఠించుటకు కృషి చేసెదము.

### ఆంధ్రదేశ గ్రంథాలయ భవనము

పటమటలంక, ఏప్రిల్ 20: ఆంధ్రదేశ గ్రంథాలయ ట్రస్టువారు పటమటలంకలో నిర్మించుచున్న శ్రీ సర్వోత్తమ భవన నిర్మాణము దాదాపు పూర్తికావచ్చినదనీ, అయితే నిర్మాణానికి పట్టే మొత్తములో ఇంకా దాదాపు రు. 6,000 లు వసూలు కావలసియున్నవి. ఆంధ్రదేశములో ఉదారులైన విద్యాభిమానుల సాయంతో త్వరలో యీ మొత్తం వసూలైనగాక యిప్పుడు అవసరమైన మరి కొన్ని కార్యములకుగూడ యేర్పాట్లు జరుగగలవని ఆశించుచున్నాము. మే నెలలో శ్రీ సర్వోత్తమ భవనప్రవేశ మహోత్సవమున కేర్పాట్లు జరుగుచున్నవి. అని కార్యదర్శి పా, నాగభూషణంగారు వ్రాసిరి.

## భారత్‌పూర్, ధోల్‌పూర్ భవిష్యత్తు

### ప్రజాభిప్రాయ సేకరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 23: భారత్‌పూర్, ధోల్‌పూర్ సంస్థానాల భవిష్యత్తును గురించి ప్రజాభిప్రాయం తెలుసుకుంటానికిగాను భారతప్రభుత్వ సంస్థానశాఖచే నియమించబడిన సంఘంవారు రేపుఢిల్లీ నుండిబయలుదేరి ఆ సంస్థానాలలో పర్యటించెదరని తెలుస్తోంది. భారతపూర్‌లో ఏప్రిల్ 24, 25 న, ధోల్‌పూర్‌లో 26, 27 న యీ సంఘంవారు ఈ రెండు సంస్థానాలను యు. పి.తో సమ్మేళనం చేయవలెనా, లేక విశాలరాజస్థాన్‌తో సమ్మేళనం చేయవలెనా అన్న విషయాన్ని గురించి పౌర ప్రముఖుల అభిప్రాయం తెలుసుకొంటారు. ఈ సంఘానికి శంకర రావుదేవు అధ్యక్షుడు. సిద్వా, హిమ్మత్ సింగ్‌లు సభ్యులు.

## పోలీసుమీద దౌర్జన్యం: ముగ్గురి అరెస్టు

చీరాల, ఏప్రిల్ 21: స్థానిక పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఆర్. వేమగిరిరావు పట్నాయక్‌గారు నిన్న సాయంత్ర బలగముతో మాలపల్లి జెల్లి 3 గురిని అరెస్టు చేసిరి. మాలపల్లిలో ఒకరు త్రాగి ప్రజాశాంతికి భంగముచేయుచున్నారని ఫిర్యాదురాగా ఆ నేరస్తుని తీసుకొనిరమ్మని యిద్దరు కానిస్టేబిల్సును పంపిరని, వారు జెల్లి నేరస్తుని తీసుకొని వచ్చుచుండగా మరి యిద్దరువచ్చి పోలీసుమీద దౌర్జన్యముచేసి పారిపోయిరని, నేరస్తుడు గూడ పారిపోయెనని అయితే. నేరస్తుని ఆ సాయంకాలమే పట్టుకొని తిరిగి అరెస్టు చేసిరని తదితర యిద్దరిని నిన్న సాయంకాలము అరెస్టుచేసిరని తెలిసినది. తెనాలి డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు వి. వి. వేణుగోపాల మొదలియారుగారు నిన్న వచ్చిరి. పోలీసుదర్యాప్తు జరుగుచున్నది. పరిస్థితులు ప్రశాంతముగానే యున్నవి.

## ఆంధ్రరాష్ట్ర బ్రాహ్మణ మహాసభ

ఆంధ్రరాష్ట్ర బ్రాహ్మణ మహాసభా వార్షిక సమావేశము మే 1 వ తేదిని ఏలూరు శంకరమఠావరణములో పండిత శ్రీ రామశాస్త్రిగారి అధ్యక్షతను జరుగును. శ్రీ మండలీక వేంకటశాస్త్రిగారు ప్రారంభోపన్యాస మొసగెదరు.

ప్రకటన

పబ్లిక్ రిలేషన్సు & పబ్లిసిటి ఆఫీసు, కలకత్తా రైల్వేస్

కలకత్తా నెం. 17 నేతాజీ సుభాష్ రోడ్డునందలి ఈస్టు ఇండియన్ రైల్వే హౌసులోనున్న కలకత్తా రైల్వేల (EI & BN Rlys) పబ్లిక్ రిలేషన్సు అండ్ పబ్లిసిటీ ఆఫీసు, 6-4-1949 నుండి, కలకత్తా నెం. 14, 15, 16 గవర్నమెంటు ప్లేస్ ఈస్టునందలి ఎస్‌ప్లనేడ్ మాన్షన్సుకు మార్చబడినది. ఉత్తర ప్రత్యుత్తరము లన్నియు క్రొత్త ఆఫీసుకే పంపవలెను.

క్రొత్త ఆఫీసు టెలిఫోన్ నెం. సిటి 2006.

పబ్లిక్ రిలేషన్సు అండ్ పబ్లిసిటీ ఆఫీసరు. కలకత్తా రైల్వేస్.

# కేంద్ర ప్రభుత్వాధికారులతో పాండిచేరిలోని కౌన్సల్ జనరల్ మంతనాలు

న్యూఢిల్లీ, ఏప్రియల్ 23: పాండిచేరిలోని ఇండియా కౌన్సల్ జనరల్ ఆర్. ఏ. బెయిగ్ ప్రస్తుతం ఢిల్లీకి వచ్చి వున్నారు. పాండిచేరి మొదలైన ఫ్రెంచి ప్రాంతాలలో ఇటీవల భారత ప్రభుత్వం క్రొత్తగా ఏప్రియల్ 15వ తేదీ నుంచీ అమలు జరుపుతున్న పర్మిట్ల విధానం యే విధంగా పనిచేస్తున్నదీ ప్రభుత్వాధికారులకు తెలియజేసి మంతనాలు జరుపుతున్నారు. ఫ్రెంచి వలసల సుంకాల ఒడంబడిక అంతమైపోయి క్రొత్త విధానం అమలుపరచిన తర్వాత పరిస్థితులను నివేదించుటకుగాను, ఆయన ఢిల్లీకి పిలువబడినట్టు తెలుస్తున్నది.

బెయిగ్ తిరిగి మంగళవారంనాడు తిరిగి పాండిచేరి వెళ్లిపోతారు.

కరైకాల్, ఏప్రియల్ 23: పాండిచేరి కరైకాల్ ప్రాంతాలలో వున్న ఇండియన్ యూనియన్ పోస్టల్ ఉద్యోగులనూ, వారి కుటుంబాలలోని యితర సభ్యులనూ, ఫోటోగ్రాఫులతోసహా ఐడెంటిఫికేషన్ పత్రాలు పొందవలసినదిగా కౌన్సల్ జనరల్ ఆజ్ఞాపించినట్టు తెలుస్తున్నది. ఈ పత్రాలను జారీచేయటానికిగాను ప్రభుత్వం నిర్ణయించిన రు 1-0-0 రుసుమునూ, అందరూ ఇవ్వవలసి వుంటుందని కూడా ఆయన తెలియజేశాడు.

## వేయిమందిని పుదుచ్చేరీ ప్రవేశింప నివ్వలేదు

ప్రవేశానుమతి పత్రము లేని కారణము

పుదుచ్చేరి, ఏప్రిల్ 24: ఫ్రెంచి భూభాగములోనికి ప్రవేశించుటకు అనుమతి పత్రము ఉండవలెనను నియమము నిన్న అమలులోనికి వచ్చుటచేత చుట్టుప్రక్కల నుండి పుదుచ్చేరి వెళ్లు బస్సులన్నియు ఆగిపోయెను. నిన్న రైలుమీద వచ్చిన వేయిమంది ప్రయాణీకులను పుదుచ్చేరిలోనికి ప్రవేశింపనివ్వలేదు. ఇండో చైనా నుండి పెట్రోలుతో ఫ్రెంచి పొగఓడ 'కట్లిన్' పుదుచ్చేరి రేవుకు వచ్చినది.

## మానభం సత్యాగ్రహ విరమణ

రాష్ట్రపతి డా॥ పట్టాభి లేఖ

పురూలియా, ఏప్రిల్ 23: మానభం లోక సేవక సంఘ కార్యకర్తయగు శ్రీ అతుల ఘోష్ గారికి కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారినుండి లేఖ వచ్చుటచేత మానభం సత్యాగ్రహము తాత్కాలికముగా విరమింపబడినది. తదనుసారముగా నేటికి నిర్ణయింపబడిన కార్యక్రమము రద్దయినది. రాష్ట్రపతి లేఖను విచారించుటకై లోకసేవక సంఘసభ జరుగనున్నది.

శాసనసభ్యులపై చర్య అపుడల బీహారు శాసనసభ్యులు ముగ్గురు మానభం సత్యాగ్రహములో పాల్గొన్నట్లు చెప్పుచున్నది. నేడు బీహారు కాంగ్రెస్ ఎసెంబ్లీ పార్టీవారు సమావేశమై ఈ ముగ్గురివిషయమై నిర్ణయములను వాయిదావేసిరి. ఈ ముగ్గురిలో నొకడను శరత్‌చంద్ర బెనర్జీగారి సంజాయిషీని సభవారు వినిరి. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ రాజ్యాంగ పరిషత్ సలహాసంఘము నిర్ణయములు గావించువరకు వేచియుండ సభవారు నిశ్చయించిరి.

## కులముపై ఆధారపడు రాజకీయపక్షముల నేర్పరుపరాదు

ఒరిస్సా ప్రభుత్వమువారి ఉత్తరవు

కటకము, ఏప్రిల్ 21: కులము నాధారము చేసికొని రాజకీయ పక్షముల నేర్పరుపరాదని ఒరిస్సా ప్రభుత్వమువారు రాష్ట్రప్రజలకు సలహా యిచ్చియున్నారు. ఇట్టి పక్షములు ఆక్షేపణీయమను వర్ణవిద్వేషమును పురికొల్పు అవకాశము కలదని వారనుచున్నారు. ఇందు విషయమై జెరోక ప్రకటన గావించుచు కొంతమంది వర్ణవిద్వేషమును, వివిధ తరగతుల వారి మధ్య పోరికొల్పుచున్నారని తమకు తెలియవచ్చినదనుచున్నారు.

## భా. జా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు

న్యూఢిల్లీ ఏప్రిల్ 23: భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ద్వితీయ సమావేశము ఇండూరులో మే 5 నుంచి 9 వరకు జరుగును. ఈ సభకు 2 వేలమంది ప్రతినిధులు వత్తురు. కార్మికుల క్షేమ లాభములకై కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వమువారు చేసిన కొన్ని చర్యలను సభవారు విచారింపెదరని తెలియుచున్నది.

# పల్లవుల కాలం నాటి చిత్రములు

## పుదుచ్చేరీ సమీపమున దేవాలయములో దొరికినవి

పుదుచ్చేరి, ఏప్రిల్ 23: పుదుచ్చేరికి కొద్దిమైళ్లదూరమున బాహూరను గ్రామములో గల ఒక శివ దేవాలయమందు పల్లవులనాటి వర్ణచిత్రమొకటి దొరకినదని ఫ్రెంచి ఇండియా పురవస్తు పరిశోధనశాఖ అధికారి తెలిపెను. ఇటీవల తానక్కడికి వెళ్లినప్పుడు తనకు ఒక చిన్న శిథిలము, ఆ శిథిలములో శివలింగము కనబడెనని, ఆ లింగముపైన చిత్రమున్నజాడ కనిపించెనని, ఆ చిత్రము గంధర్వుని ఆకారములో నుండెనని, దానిలో సౌందర్యము ఉట్టిపడుచుండెనని ఆయన చెప్పెను. ఆ చిత్రము పల్లవులకాలమునాటిదని ఆయన అభిప్రాయపడెను.

## తిరుపతిలో నీటి ఇబ్బంది తీర్చే ఏర్పాటు

తిరుపతి, ఏప్రిల్ 20: పురపాలక సంఘం ప్రత్యేక సమావేశము నిన్న చెయిర్మన్ సి. యస్. రామయ్యగారి అధ్యక్షత క్రింద జరిగినప్పుడు తిరుపతిలోని నీటి ఇబ్బందిని పోగొట్టుటకు పబ్లిక్ బావులను శుభ్రపరచి వాటికి రాట్నములు వేయుటకు తీర్మానించిరి.

ప్రస్తుతము తిరుపతిలో ప్రజలు నీటికి చాల యిబ్బందులు పడుచున్నారు. కొళాయిలో ఉదయము ఒక గంట, సాయంత్రము అరగంట నీరు వచ్చుట కూడ దుర్లభంగా నున్నది.

### శ్రీ త్యాగరాజస్వామి ఆరాధన మహోత్సవము

ఈనెల 18వ తేదీన ప్రారంభమైన శ్రీ త్యాగరాజ స్వామివారి ఆరాధన మహోత్సవము నిన్న రాత్రితో పూర్తియైనది. ప్రసిద్ధ సంగీత విద్వాంసులు అరియక్కుడి రామానుజ అయ్యంగార్, చెంబై వైద్యనాథ భాగవతార్, టి. కే. రంగాచారి, ఎస్. వి. పార్థసారథి, చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్ళై, మాయవరం రాజమయ్యర్ సోమసుందరం, రామచంద్రన్, ఎన్. సి. వసంతకోకిలం, వైకం సరస్వతి, రాటకోకిలం, ముత్తుమీనాక్షి పార్టీ మొదలైనవారి పాటకచ్చేరీలు జరిగెను.

రోగం, మంగళం, పందనెల్లూరు పెరియనాయకి భరతనాట్యములు చేసిరి.

తంజావూరు రామదాస్, మేలట్టూరు రామచంద్రన్, కృష్ణమూర్తి, (మృదంగం) విశ్వనాథశర్మ, తిరువనంతపురం కృష్ణన్ (ఫిడేల్) పక్కవాద్యములు వాయించిరి. శ్యామసుందర్ అనే 10 ఏండ్ల పిల్లవాడు కంజిరా వాయించినాడు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి ఉపన్యాసముతో ఉత్సవము పూర్తియైనది.

ఉత్సవ నిర్వాహకులు ఆర్. కృష్ణరావు, పి. రాధాపతి, కే. నారాయణరావు, వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, కే. వి. సుబ్రహ్మణ్యం, సి. అన్నారావుగార్లు ప్రశంసనీయులు.

# కాంగ్రెసు సంఘాలలో అధికారరీత్యా సభ్యత్వము

## సమావేశములకు హాజరుగానిచో రద్దగునని రాష్ట్రపతి ప్రకటన

ఏలూరు, ఏప్రిల్ 21: కాంగ్రెసు సంఘముల సాధారణ సభ్యులు వరుసగా అసంఘ సమావేశములు మూడింటికి హాజరుకాక పోయినచో, వారి సభ్యత్వము రద్దయిన రీతిగా, అసంఘములలో అధికారరీత్యా సభ్యులగువారి సభ్యత్వము కూడా రద్దగునా యను విషయముపై సందేహనివృత్తి కల్గుటకు, రాష్ట్రపతి ఈ క్రింది విధముగా తెల్పిరని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు అన్ని జిల్లా సంఘములకు తెల్పియున్నారు.

### రాష్ట్రపతి నిర్ణయము

"సరియైన వ్యవధితో నోటీసు యిచ్చి, సక్రమముగ సమావేశపర్చబడిన జిల్లా కాంగ్రెసు సంఘ సమావేశములు మూడింటికి వరుసగా ఆజిల్లాలోని రాష్ట్ర కాంగ్రెసు సభ్యులు హాజరుగానిచో వారి కధికారరీత్యా సంక్రమించు ఆజిల్లా కాంగ్రెసు సంఘ సభ్యత్వము రద్దగును. కానివారు రాష్ట్రకాంగ్రెసు సభ్యులుగా ఉండగలరు."

ఇదే విధముగా రాష్ట్ర, జిల్లా, తాలూకా కాంగ్రెసు సంఘములలోని సభ్యులు, తమకు అధికారరీత్యా సభ్యత్వముగల అధీన సంఘముల సమావేశములు మూడింటికి వరుసగా హాజరుకాని ఎడల ఆ అధీన సంఘములో వారికి అధికారరీత్యాగల సభ్యత్వము రద్దగుననీ, వారి ఎన్నిక సభ్యత్వము అటులనే నిలచి ఉండుననీ రాష్ట్రకాంగ్రెసు సంఘమువారు తెల్పియున్నారు.

ఈ పురపాలకసంఘం 20-వ తేదీన సమావేశమైనప్పుడు కనిగొళ్ళ జనార్దన గుప్త అనే సభ్యుడు కౌన్సిలు మాజీ అధ్యక్షురాలు శ్రీమతి చుండూరి రత్నమ్మగారి చిత్రపటమును కౌన్సిలుకు బహూకరించగా అంగీకరించి దానిని కౌన్సిలు హాలులో నెలకొల్పుటకు తీర్మానించిరి. స్థానిక సాహిత్యమండలికి రు. 16/-విరాళము మంజూరు చేసిరి.

ప్రభుత్వమువారు శ్రీమతి మూల్పూరు చుక్కమ్మ, దంతులూరి నారాయణరాజు, జక్కంసెట్టి ఆదినారాయణగార్లను పశ్చిమ గోదావరిజిల్లా మోటారు ట్రాన్స్‌పోర్టు అథారిటీ అధికారేతర సభ్యులుగా నియమించిరి. (స్వ. వి.)

### రాయలసీమ మహాజనసభ

నంద్యాల, ఏప్రిల్ 20: రాయలసీమ మహాజన సభ ద్వితీయ మహాసభ ఇక్కడ జూన్ నెలలో జరుగనున్నది. ఈ సందర్భంలో ఆహ్వాన సంఘము ఏర్పాటు చేయుటకు మే 1న ఇచ్చట ఒక సమావేశము జరుగునని పి. సి. వెంకటరెడ్డి, జి. రామిరెడ్డి, రాయసం శేషగిరిరావుగార్లు వ్రాసిరి.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras